ఓమ్.



శ్రీమత్సద్గురుశాన్తానన్ద

సరస్వతీస్వామినశ్చరణారవిన్దాభ్యాంనమోనమః.

# పారమార్థికసన్న్యాసము.

సకల ముముక్షుజనానుకూలముగనుండుటకై

ప్రచురింపబడియె.

రెండవకూర్పు.

విక్రయమునకుగాదు.



MADRAS:

V. N. JUBILEE PRESS,

*Armenean Street.*

1901.



ఓమ్

# (పారమార్థిక సన్న్యాసమననెద్ది?)

(ఆంతర వైరాగ్యమే ప్రయోజనకారిగాని) బాహ్యవైరాగ్యము, చవిటి నేల విత్తిన విత్తనమును, గ్రుడ్డివానిచేత నిచ్చినయద్దమును, చెవిటివానియెదుటఁ బాడిన సంగీతమును నిష్ఫలమైనట్లు, ఏమాత్రము ప్రయోజనకారికాదనియు, ఎడతెగని విషయ వాంఛలను ఈతతోపులలో, సంతతము సంచరించుచు ప్రమాదమను మద్యపానము చేత విస్మృతిజెంది, బ్రహ్మాత్మైక్యానుసంధానమను సన్న్యాసమును స్వీకరించుకొని

---

ఖించక, పురాకృతసుకృతవిశేషముచేత లభించిన మానవజన్మమును వ్యర్థపుచ్చుట కంటె గొప్పనష్టమేదియు లేదనుటకు శ్రవణకాలమున లభించిన శ్రుతి స్మృతి ప్రమాణములు, ముముక్షుజనంబుల కత్యంతోపయుక్తంబుగ నుండునటుల నిందచ్చు చేయింపంబడెను. విక్రయమునకుఁగాదు. శబ్దదోష అర్థదోషాదులుండిన అసూయఁ బొందక సులభోపాయముగఁ జెప్పఁబడిన పరబ్రహ్మైక్యజ్ఞానమను సన్న్యాసమును

బోధించు ప్రబలశ్రుతుల తాత్పర్యమును మాత్రము గ్రహించి, కావేరిగట్టున నొక శునకము నీళ్లను ముట్టెనని పరితపించి ప్రయాగకు వెళ్లి, అందుండి గంగాజలమును కొనివచ్చి కావేరి నీళ్లను కడిగఁదలఁచినట్లును, గాలి వీచుటచే నగ్నిజ్వాల కదలఁ జూచి; అయ్యయ్యో, అగ్నిహోత్రునికి చలి యెక్కువాయెనే, సన్ని ముంచుకొనెనే, అని దుఃఖించి శాలువనుగప్పి ఔషధప్రయోగమును యత్నించినటులను తమ నీడ తామెటుల దిఁటగిన, నటుల దిఱుగుటనుఁజూచి మిగుల కోపగించుకొని వెన్నటికిని తమవెంట నంటిరాకుండునటులఁ జేయుటకై యొక పెద్దపల్లము త్రవ్వి దానియందు పాతిపెట్టబోవు నటులను, శూన్యమగు ఆకాశమును చేతులుఁజాచి అందుకొనఁబోయినట్లు మనఃపరిపాకములేని కొందరు పూజలలోపల మానసపూజయు, సన్న్యాసములలోపల మానస సన్న్యాసమును, ఉత్కృష్టములైనవని తెలిసికొనక తల బోడిచేసుకొని, కావిబట్టలు ధరించుకొనుటయే సన్న్యాసము తద్వారా ముక్తి లభించునని వాదించినను, వాండ్లతో

"వేషభాషలెరిగికాషాయవస్త్రముల్ ।
బోడినెత్తిగల్గిబొరయుచుంద్రు ।
తలలుబోడులైనతలపులుబోడులా ?
విశ్వదాభిరామ వినరవేమ" ॥

అను ప్రమాణమునుబట్టి తలబోడి చేసుకొన్నమాత్రమున తలంపులు బోడికానేరవని వాదులాడక;

శ్రు॥ "జాతంమృతమిదందేహం మాతాపితృమలాత్మకమ్ ।
సుఖదుఃఖాలయామేధ్యం స్పృష్ట్వాస్నానంవిధీయతే ।
ధాతుబద్ధంమహారోగం పాపమన్దిరమధ్రువమ్ ।
వికారాకారవిస్తీర్ణం స్పృష్ట్వాస్నానంవిధీయతే ।
నవద్వారమలస్రావం సదాకాలేస్వభావజమ్ ।
దుర్గన్ధందుర్మలోపేతం స్పృష్ట్వాస్నానంవిధీయతే."

అను మైత్రేయోపనిషద్వాక్యరీతిని హేయమైన ఈదేహమే తాననెడి నిశ్చయమును కలుగఁజేసి, యుక్తాయుక్త సుజ్ఞానమును చూడఁగాని విషయ సుఖములను గడ్డిమేయుచు విఱ్ఱవీగులాగునఁజేసిన మహామోహమును పోగొట్టుకొని

"స్వస్వరూపస్యవిజ్ఞానాత్ నాధికంతీర్థముచ్యతే."

అను గురుజ్ఞాన వాసిష్ఠ వాక్యరీతిని సర్వోత్తమోత్తమంబగు స్వస్వరూప విజ్ఞానమను తీర్థమందు మగ్నులైసుఖింతురని ప్రార్థించెదము.

ఓమ్.

సమస్త తత్త్వాతీత సదానందదేవా ! నమస్తే ! నమస్తే ! నమస్తే ! నమః !

"త్యాగస్ప్రపఞ్చరూపస్య సచ్చిదాత్మావలోకనాత్ ।
త్యాగోహిమహతాంపూజ్య స్సద్యోమోక్షప్రదాయకః ॥"

అనగా, ఆనందైకరస బ్రహ్మస్వరూపాభిముఖమయినపుడు, లేక, విజ్ఞానదశతోఁగూడినపుడు దేహాదులు సంకల్ప వికల్పాత్మకమయిన మనస్సును, ఘటపటాది నిశ్చయాత్మకబుద్ధిని, దృశ్యాత్మకమయిన ప్రపంచంబు మొదలగువాటిని మఱచుటయే త్యాగమగును. ఇట్టి త్యాగము తత్కాలమందే మోక్షసుఖమిచ్చునట్టిదియును మహాత్ములచే పూజ్యమయినదియును నయియున్నది. అనగా, ప్రకాశస్వరూపమైన దీపమునుండి బైలువెడలినకాంతి, ఘటపటాది వస్తువులను నగుపఱచి, పిదప తననుజూపి ఆకాంతి తనయందే లీనమయినట్లు, త్రిగుణరహితమైన శుద్ధసత్వస్వరూపమగు మనస్సు సచ్చిదానంద పరబ్రహ్మమందు లీనమయి, నామరూపములతోఁగూడిన ప్రపంచవికారకార్యజాలసంకల్పత్యాగమే త్యాగమని బ్రహ్మవేత్తలచే శ్రుతి యుక్త్యనుభవములవల్ల అంగీకరింపబడినదని బోధించు తేజోబిందూపనిషద్వాక్యరీతిని చూడగా, ఒకడు దారాపుత్రాదులతోఁగూడి గృహమునవసించుటచే, సంసారియగుననియు అది లేనిమాత్రమున జ్ఞాని యగుననియు తలచుట వెఱ్ఱితనమని సిద్ధించుచున్నది, మరియు;

"శ్లో॥ దీర్ఘంవాపిమనోరాజ్యం సంసారందుఃఖసాగరమ్."

(వరాహోపనిషత్.)

"చిత్తేచలతిసంసారో నిశ్చలంమోక్షఉచ్యతే."

"చిత్తమేవహిసంసార స్తత్ప్రయత్నేనశోధయేత్."

(మైత్రేయోపనిషత్.)

అను ఉపనిషద్వాక్యములరీతిని దీర్ఘమనోరాజ్యమేదియో అదియే దుఃఖసముద్రమైన సంసారమనియు దారాపుత్రాదులే సంసారముగాదనియు వివేకులకు తప్పక తేటపడును. ఈ యెడతెగని విషయచింతను పోగొట్టుకొనవలయును. బాహ్య సంసారమును త్యజించి వానాంబు పర్ణాశనులయి, విజనస్థలంబున వాసము చేయుచుండిన భరతాదులు పడినపాట్లు స్మృతులద్వారా వినియున్నాము. నీడతో పోరంబూనుకొన్న నెంతఫలము లభించునో అంత ప్రయోజనమే బాహ్య సంసారమును త్యజించుటచే గలుగును, మరియు షడ్రసోపేతములైన యన్నాది పదార్థము భుజంచుచు యౌవనావస్థలో నున్నవారిని ఇంద్రియములు తమవైపునకు లాగకమానవు.

"ఇతో భ్రష్టస్తతో భ్రష్టమ్."

అను వాక్యరీతిని బాహ్య సంసారమునకు చెడి జీవపరైక్యానమను పారమార్థిక సన్యాసమునకు చెడి ఇహపరములకు వెలియగుట యుక్తముకాదు. గాన;

"సంసారమునందుండియు సంసారమమిధ్యజేసి, సర్వముతానై
సంసారమందె తెలసిన సంసారే రాజయోగిసత్యమురామా."

అను వసిష్ఠోపదేశవాక్యరీతిని, సంసారమునందుండి జలగవలె నెందునంటక వశీకృతమానసేంద్రియులై, సమస్తజనులకు స్నేహితులై, అతిదయాళువులై, నాదియను మమకారములేనివారై, సుఖదుఃఖములయందు సమబుద్ధిగలవారై, ఓర్పుగలవారై, యెల్లప్పుడానందభరితులై, కోపము వెఱపులేనివారై, ఇష్టానిష్టవస్తువులు కల్గుటయందు సంతోషమును దుఃఖమునులేనివారై, యదృచ్ఛాలాభ సంతుష్టులై, లభింపనివస్తువులయందు కోరికలేనివారై, దూషణభూషణలను సమముగాజూచువారై, సదా బ్రహ్మాత్మైక్యాను సంధానము గలిగియుండి అనగా, సద్గుణసంపత్తిచే లోకవంద్యులై, యుత్తమసిద్ధినిజెందిన శ్రీజనక విదురాదుల సచ్చరిత్రములు పురాణేతిహాసములయందు వినబడుచున్నవి. చండాలవాకిట బ్రాహ్మణునికి ప్రవేశయోగ్యముకానట్లు జ్ఞానరత్నము నపహరింప సమయమువేచి పొంచియుండు కామాద్యరిషడ్వర్గమను చండాలులు వసించియుండు పర్యంతము, చేతనుని హృదయము స్వస్వరూప విచారమునకును నిజబోధానందానుభవమునకును యోగ్యముకాదు; గాన, బుద్ధిమంతుడు అహంకార మమకార, విశ్వాసఘాతకాది దుర్గుణములను చండాలులను దూరముగపారదోలి;

"యస్యవాఙ్మనసీశుద్ధే సమ్యగ్గుప్తేచసర్వదా,
సవై సర్వమవాప్నోతి వేదాన్తోపగతంఫలమ్."

అనగా, ఎవనికి వాక్కు మనస్సు శుద్ధముగనున్ను, అణుగుదలగానుండునో వానికి వేదాంతవాక్యముల ప్రయోజనము కోరలలేక సిద్ధించునని యుండు నారదపరివ్రాజకోపనిషద్వాక్యమును అనుభవమునకు దెచ్చుకొని, అట్టి నిర్మలహృదయమును భగవంతునికాలయము చేసి శమదమముల నెడు జలముచే స్థలశుద్ధిచేసి, పరదుఃఖాసహిష్ణుడై, ఎండినచెట్టునకు నీళ్లుపోయుటయు, ఆకలిగొన్నవారికి నన్న మిడుటయు, వస్త్రములేక చలిచేపీడింపబడువారికి వస్త్రములిచ్చుటయు, రోగార్తులకు నుపచారము చేయుటయు, బీదలైనవారి శిశువులకు విద్యాదానంబొసంగుటయు, క్రోధయుక్తులకు శాంతినిగల్పించుటయు, అసత్యవాదులకు సత్యముగఅపుటయు, భగవద్విముఖులకు భగవద్భక్తి గలుగజేయుటయు నను నివి భగవంతునికి ముఖ్యారాధనములుగజేసి,

" అహింసాప్రథమంపుష్పం పుష్పమింద్రియనిగ్రహమ్,
సర్వభూతదయాపుష్పం క్షమాపుష్పంవిశేషతః,
శాన్తిపుష్పంతపఃపుష్పం ధ్యానపుష్పంతథైవచ,
సత్యమష్టవిధంపుష్పం, విష్ణోఃప్రీతికరంభవేత్."

అనురీతిని పశువు పర్వతారణ్య భూములయందు మేయుచు తన దూడయందు మనస్సు నుంచునట్లును, పరపురుషానురక్తిగల స్త్రీ గృహంబున యెల్లపనులను క్రమముగ చేయుచు జారపురుష సాంగత్యమును తలంచునట్లు సంసారమున వర్తించుచుండియు, అత్యంత ప్రీతికరమగు అహింస మొదలగు పుష్పములచే అనవరతము భగవంతుని నర్చించుచు మనస్సును వానియందుంచవలయును. పుత్రదారగృహాదులే మమకారవర్థకములనీ తలవకూడదు. వీనిని, విశ్వేశ్వరస్మృతియందు జెప్పినచొప్పున నివర్తించి, కాషాయదండకమండలాది వేషములు ధరించి భూసంచారము చేయుటకు సామర్థ్యము లేకుండుటచేత, గ్రామమందుగాని పట్టణమందుగాని మఠము గట్టుకొని ఉదరపోషణముగా దినదిన మొక్కొక్క ఇంటిలో భుజించుచు, లేక నడుచుటకు సామర్థ్యముండిన యెడల భుజించినచోట నిద్రించక, నిద్రించినచోట భుజించక, గ్రామమున నొక దినమును, పట్టణమున మూడు రాత్రులును, పుణ్యనదీక్షేత్రాదులందు ఐదు లేక ఆఱు దివసములకు ఎక్కువగాకుండ నివసించుచు అక్కడక్కడ గృహస్థుల యిండ్లయందు భుజించుచు సంచారము చేయువారికి, పైన ధరించిన కాషాయదండాది వేషములు మోక్షమిచ్చునదికాదు. యోచించిచూడగా ఇందువలన భుక్తిసుఖమున్ను తీర్థయాత్రాదుల ఫలమేగాని ముక్తిలేదు.

"జ్ఞానశిఖినోజ్ఞాననిష్ఠాః జ్ఞానయజ్ఞోపవీతినః।
జ్ఞానమేవపరం తేషాం పవిత్రంజ్ఞానముచ్యతే."

(బ్రహ్మోపనిషత్.)

" విద్యయామృతమశ్నుతే. "

"జ్ఞానేనవిద్వాంస్తేజ అభ్యేతినిత్యంనవిద్యతేహ్యన్యధాతస్యపన్థాః."

పురుషుడు జ్ఞానముచేత నిత్యమైన తేజస్సును పొందుచున్నాడు, మఱియొక విన మోక్షమార్గములేదు.

" శ్రమార్థమాశ్రమాశ్చాపి వర్ణానాంపరమార్థతః."
" సర్వంజ్ఞానప్లవేనైవ వృజినం సన్తరిష్యసి."

" జ్ఞానంని శ్రేయసం ప్రాహుర్బుద్ధానిశ్చయదర్శినః
తస్మాద్జ్ఞానేనశుద్ధేన ముచ్యతేసర్వపాతకైః."

నిశ్చయమగు స్వప్రకాశస్వరూపమును దర్శించునట్టి జ్ఞానులు బ్రహ్మజ్ఞానమును ముక్తినిగా జెప్పుచున్నారుగాన జీవుడు పరిశుద్ధమగు బ్రహ్మజ్ఞానముచే సమస్తపాతకములనుండి విడువబడుచున్నాడు.

అను ఇత్యాదనేక శ్రుతి స్మృతి వాక్యముల రీతిని మోక్షమునకు జ్ఞానమే ముఖ్యముగాని వర్ణాశ్రమాచార వేషములు ప్రయోజనములుగావని వివేకులు నిశ్చయింపవలసియున్నది.

మరియు, పుత్రదారగృహాదులే మమకారవర్ధకములని తలచి, వానిని నివర్తించువారికి, కాషాయ వస్త్రకమండలములు, ఆసనాదులు మమకారయోగ్యములగును. ఇవియు వర్జించినవారికి శరీరము మమకారహేతువేను. విషము కొంచమయినను అధికమైనను ప్రాణము బోగొట్టుటకు సమర్థమగునట్లు మమకారయోగ్యములగు పదార్థములేకమైనను అనేకమైనను, చేతనునిపాతిత్యమునుతప్పక జేరిచి,భగవన్నిగ్రహకారణమైభవరోగవర్ధకమైయుండును, వనంబునవసించి మనోనిగ్రహమునకుసామర్థ్యములేక శరీరమునందును, తదనుబంధి పదార్థములయందును మమకారము చేయుటకన్న గృహంబున వశించుచు,

" వీతక్రోధస్య గృహం తపోవనమ్."

అను రీతిని క్రోధమునువదలి దానినే తపోవనముగ తలచి, పుత్రదార గృహారామక్షేత్రాది సర్వము ఈశ్వరవిభూతియనియు, తనకు దేనియందును సంబంధము లేదనియు, నధ్యవసించి, మమకారవర్జితుడయి, భేదజ్ఞానమనెడి యడవిని సమూలముగ ఛేదించి, జ్ఞానాగ్నిచే కాల్చి నీరుచేసి యభేదామృతమును పానము చేయుచు, తామరాసనందు నీరంటనట్లును, సూర్యుడు సకలమైన వాపీకూపతటాకాదులయందలి నీళ్లను తన కిరణములచే బీల్చినను ఆ నీళ్లలోని అడుసు నాచు మొదలగువానిని అంటని విధమున మాయావికారములైన దుర్గుణములను అంటక, ఇంద్రజాల కల్పిత వస్తువులను వివేకి అయదార్థమని తెలిసికొనియు, వినోదము కొరకు జూచుచు భోగింపుచుండులాగునను, ఇతర వర్ణములు తనయందారోపింపబడినను అవి తనవిగాక వేఱుగానుండెడి స్ఫటికపురాతివలెను, స్త్రీవేషధారియైన పురుషుడు స్త్రీచిహ్నములైన విరహతాపంబులంబొందినట్లు అభినయించుచు అవ్వేషంబుననుండినను తాను పురుషుడను దృఢజ్ఞానముగలిగి, అవ్వేషమందు నిరభిమానియై యుండుటచే, తద్గుణంబుల నంటకయుండునట్లు;

"సర్వం బ్రహ్మేతి సంకల్పాత్సుదృఢాన్ముచ్యతే మనః ।
కృశోఽహం దుఃఖబద్ధోఽహం హస్తపాదాదిమానహమ్ ।
ఇతిభావానురూపేణ వ్యవహారేణ బధ్యతే ।
నాహం దుఃఖీ న మే దేహో బన్ధః కోఽస్యాత్మనిస్థితః ।
ఇతిభావానురూపేణ వ్యవహారేణ ముచ్యతే ॥

అను మహోపనిషద్వాక్యరీతిని తాను స్వరూపమాత్రుడై

"కింకరోమి క్వగచ్ఛామి కింగృహ్ణామి త్యజామి కిమ్
యన్మయాపూరితం విశ్వం మహాకల్పామ్బునా యథా."

(వరాహోపనిషత్.)

"అన్తః పరిత్యాగి బహిః కురు యదాగతమ్."

"అన్తస్త్యాగి బహిస్సంగి లోకే విహర రాఘవ."

అను శ్రుతిస్మృత్యర్థముల చొప్పున ప్రవర్తించుచు

"సర్వసంకల్పసన్న్యాస శ్చేతసా యః పరిగ్రహః."

(మహోపనిషత్.)

"జీవాత్మనోరైక్యం సన్న్యాసః పరికీర్తితః."

(మైత్రేయోపనిషత్.)

"సర్వధర్మాన్ పరిత్యజ్య, నిర్మమో నిరహంకారో భూత్వా బ్రహ్మేశం శరణముపగమ్య, తత్త్వమసి, సర్వం ఖల్విదం బ్రహ్మ, నేహ నానాస్తి కిఞ్చనేత్యాది మహావాక్యార్థానుభవజ్ఞానా ద్బ్రహ్మైవాహమస్మీతి నిశ్చిత్య నిర్వికల్పసమాధినా స్వతన్త్రో యతిశ్చరతి స సన్న్యాసీ స ముక్తస్స పూజ్యస్స యోగీ స పరమహంస, స అవధూతస్స బ్రాహ్మణ ఇతి."

(నిరాలంబోపనిషత్.)

ఇత్యాది ఉపనిషద్వాక్యములరీతిని సూర్యుడు మొదలుగాగల తేజోవంతములైన ద్రవ్యములకు స్వప్రకాశస్వరూపమై, శరీరములయందుండునదియైనను శరీరములుగాని, నిరాకారవస్తువై, బ్రహ్మాదిపిపీలికాంతమగు యెల్ల దేహములనెడి పెట్టెలయందు మాణిక్యమువలె తేజరిల్లుచుండునదై, అపరిమితములైన లోకసమూహమును తోపింపజేసియు తానొకటిచే తోపింపబడక ప్రకాశించునదే పరబ్రహ్మస్వరూపము. వెలుపల

దోచుచుండెడి నామరూప ప్రపంచము అనిత్యము. ఈ సదసద్రూపములం బ్రహ్మప్రపంచముల రెంటికి నడుమ నూగుచుండెడి ఆకృతిగలిగి యేదియున్నదో నే మానసమని బ్రహ్మవేత్తలందురు. అనిత్యమైన సంసారదుఃఖ విషయసకలక్షేత్ర మానాది మనోవ్యాపారము వీడిన తూష్ణీంభావరూపమైన స్థితి సన్యాసము. అన సకలధర్మములు వదలి, నేను నాదియను అహంకార మమకారధర్మములను ముం లిఖింపబడియుండు విధమున కూర్చి, సమస్తము భగవత్స్వరూపము ఇచ్చట అ కమునునది స్వల్పము కూడలేదను ఇత్యాది మహావాక్యార్థానుభవజ్ఞానమువలన నే బ్రహ్మేతరముగానను నిశ్చయముకలిగి నిర్వికల్పసమాధి నిష్ఠయందుస్వతంత్రముగ సం రించువాడేసన్యాసి, ముక్తుడు, పూజార్హుడు, యోగి, పరమహంసుడు,వాడే అవధూ (కౌపీనమువర్జించి తిరుగువాడు అవధూతగాడని ఈ శ్రుతి వాక్యముచే స్పష్టమగు న్నది.) ఇందు కనుగుణ్యముగ;

"విజానన్తిమహావాక్యం గురోశ్చరణసేవయా।
తే వైసన్యాసినఃప్రోక్తా ఇతరేవేషధారిణః."

అనగా సద్గురు పాదసేవచే లభ్యమయిన మహావాక్యార్థాను సంధానముచేయ వారే సన్యాసులు ఇతరులు వేషధారులని స్మృతి బోధించుచున్నది. మరియు అత వర్ణాశ్రమమన్న బాహ్య సంసారమును వదలి కన్నదిక్కుల కన్న పదార్థముల భుజిం చుటకాదు.

శ్రు॥ " యశ్శరీరేన్ద్రియాదిభ్యో విహీనంసర్వసాక్షిణం
పారమార్థిక విజ్ఞానం, సుఖాత్మానంస్వయంప్రభం
పరతత్వంవిజానాతి సోతివర్ణాశ్రమీభవేత్."

(నారదపరివ్రాజకోపనిషత్.)

అనగా ప్రాకృతశరీరేంద్రియములులేని, సమస్తమునకు ఉపద్రష్టయై పరమార్థ విజ్ఞానస్వరూపియై, సుఖస్వరూపియై స్వయంప్రకాశమైన పరతత్వమందు మగ్నతజెంది ఆనందించుటయే అతివర్ణాశ్రమము. దారాపుత్రగృహారామక్షేత్రాదులతో గూడి యుండియు బ్రహ్మైక్యానుసంధానమను సన్యాసమును స్వీకరించుకొని,

---

"నైవకించిత్కరోమీతి యుక్తోమన్యేతతత్త్వవిత్,
పశ్యఞ్ఛృణ్వన్స్పృశఞ్జిఘ్రన్నశ్నన్గచ్ఛన్స్వపఞ్శ్వసన్."

" ప్రలపన్విసృజన్గృహ్ణ న్నున్మిషన్నిమిషన్నపి ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్తఇతిధారయన్."

అనగా బ్రహ్మజ్ఞాని కండ్లతో చూచుచు, చెవులతో ఆకర్ణించుచు, దేహము చేత తాకుచు ముక్కు చేత వాసన చూచుచు, జిహ్వ చేత భక్షించుచు కాళ్ల చేత నడచుచు నిద్రించుచు శ్వాసనిశ్వాసములు విడుచుచు మాటలాడుచు మూత్రపురీషములను విడుచుచు విషయములను అంగీకరించుచు; కన్నులు మూయుచు తెరచుచు, ఇంద్రియములు, ఇంద్రియవిషయములయందు ప్రవర్తించుచున్నవే గాని పరబ్రహ్మమైన తాను యేమియు చేయలేదని చిత్తశుద్ధిగలిగి తలచునను భగవద్వాక్యానుష్ఠానమును పొంది, ఆమ్రఫలము ఒక్కటియేయైనను, దానియొక్క ఆకారమును కన్ను చేతను, రుచిని నాలుక చేతను, వాసనను ముక్కు చేతను, స్పర్శమును హస్తము చేతను, ఇది ఆమ్రఫలమను పేరును వాక్కు చేతను అనగా పంచభూత సంబంధములైన జ్ఞానకర్మేంద్రియ మేళనములు గలిగిన అయిదింటి చేతను తెలిసికొనినటుల, పరబ్రహ్మమందలి అభిన్నములైన సచ్చిదానంద నిత్యనిర్మలత్వాదులయినను, అంతఃకరణమందలి త్రిగుణభేదములచే వేర్వేరుగా దోచబడుచున్నవనిన్ని అనగా, సత్తును అవ్యక్తములయిన బ్రహ్మాదిపిపీలికాంతము, వస్తువులు గాను, చిత్తును ఆయావస్తువుల నామములు గాను, ఆనందము ఆయావస్తువులవలన కలిగెడి సుఖము గాను, నిత్యమును అనిత్య వస్తువులు గాను, నిర్మలమును అనిర్మలములయిన ఆణవాదిపంచ మలములు గాను, భిన్నభిన్నములుగా ఆసచ్చిదాదులు బుద్ధిభ్రమచే దోచుచున్న వేగాని వేరుగావని, నిశ్చయించుకొనవలయును. చపలస్వభావముగల సంసార ప్రతిబంధ మొకవేళ బ్రహ్మైక్యానమును సన్న్యాసమును అనగా బ్రహ్మనిష్ఠను జెడంగొట్టం దలపెట్టినచో బ్రహ్మ దృఢప్రజ్ఞపోయి అజ్ఞానాంధకారకూపములోం జిక్కుపడవలసి వచ్చునుగదాయనిన, దివిటీని చేతంబూని చీకటిని నుండుమన్న నేలాగు నుండంగలుగును! పిల్లిని దగ్గరనుంచుకొని చిలుకనుం బలుకుమన్న నేలాగుం బలుక నేర్చును! పశువు లెంతంబలిసియున్నను వ్యాఘ్రము ముందరి కెట్లువచ్చును? ప్రవాహమందుంబడిన గొప్పశిల యెట్లుచలించును? దేహాదులు తానని భావించు అజ్ఞానమును పాఱందోలి అఖండమై, ఆద్యంతరహితమై, ఆనందమయమై, సత్తామాత్రమై, అణువై, మహత్తై, స్వయంప్రకాశమై, దిగ్దేశకాలవ్యవస్థలు లేనిదై, యోగవిద్యాసమర్థులకుగూడ సాధ్యముకానిదై, బాహ్యసన్న్యాసము పుచ్చుకొన్నను, తీర్థయాత్ర చేసినను, పుణ్యక్షేత్రములదర్శించినను, తెలిసికొనుట కసాధ్యమై, ఆత్మానాత్మ వివేకులకు మాత్రము సులభసాధ్యమై వెలుగు పరబ్రహ్మమే చిదాకాశమనియు, అజ్ఞానాకాశమే తానని సద్గురుసన్నిధిని, నిస్సంశయముగాం దెలిసికొన్న మీదట అజ్ఞానమునుండుమన్న నేలాగున నుండంగలుగును ! అనగా జాగ్రదవస్థలయందు నింద్రియవ్యాపారమును,

స్వప్నావస్థయందు మనోవ్యాపారమును సుషుప్త్యవస్థయందు శూన్యతనుఁగనుఁగొని భ్రమింపకయుండు నిశ్చలజ్ఞాన సంపదనొందిన వానియుందుఅ అజ్ఞానము తలచూపి, లేనిపోని చిక్కులు పెట్టవు. ఒకవేళ తలచూపినను వ్యాఘ్రమునకు నగుపడ్డపశువువలె ఉత్తరక్షణమే నశించును.

"యథాతరఙ్గకల్లోలై ర్జలమేవస్ఫురత్యలమ్."

అను యోగశిఖోపనిషద్వాక్యరీతిని సముద్రమందు అలలకు అవలనిశ్చలముగా నుండిన జలము, ఇవతలతరంగములుగా పైకెగసి, అనేకబిందువులుగా నేర్పడి మరల ఆనీరే అయినట్లుప్రపంచమెంత వికారముగాగనబడినను సచ్చిదానంద స్వరూపేతరము లేదని గ్రహించి, అఖండాకారతూష్ణీంభావమునుదాల్చి సుఖించి, ప్రపంచాభిముఖ మయినను వేఱువేఱుగా దోచినందుకు కారణమైనబుద్ధి భ్రమనువదలి

"పురుషఏవేదంవిశ్వమ్."

"యస్మాత్పరంనాపరమస్తి కిఞ్చిత్తేనేదం పూర్ణం పురుషేణసర్వమ్."

(ముణ్డకోపనిషత్.)

"పురుషాన్న పరంకిఞ్చిత్

(కఠోపనిషత్.)

"సయథాసైన్ధవ ఘనోన న్తరోబాహ్యః కృత్స్నో రసఘన
ఏవైవంవా అరేఽయమాత్మా అనన్తరోబాహ్యః కృత్స్నః
ప్రజ్ఞానఘనఏవేతి."

(బృహదారణ్యకోపనిషత్.)

"ఓమిత్యేతదక్షరమిదంసర్వమ్"

(మాణ్డూక్యోపనిషత్.)

"ఇదంసర్వంయదయమాత్మా ఆత్మైవేదంసర్వమ్."

(ఛాన్దోగ్యోపనిషత్.)

ఇత్యాది శ్రుతియుక్త్యనుభవంబులవలన గలిగిన బ్రహ్మేతరము లేదను నిశ్చయము వదలక సదా అనంవధరితులై యుండువారికి నించుకయు సంశయములేక పునరావృత్తిరహిత మోక్షము సిద్ధించునని శ్రుతి స్మృతి సహస్రంబులు ఘోషింపుచున్నవి.

నారాయణ నారాయణ నారాయణ.

శ్రీమత్సద్గురు శాన్తానన్ద సరస్వతీస్వామినశ్చరణారవిన్దాభ్యాం నమోనమః,

ఓమ్ తత్సత్.

శ్రీమదఖణ్డసచ్చిదానన్దకృష్ణపరబ్రహ్మణేనమః.

# చతుర్వేష

# ప్రశ్నోత్తరార్యోపదేశ బోధదర్పణమ్.



సకలముముక్షుజనానుకూలంబుగ నుండునటుల

బళ్లారి సన్మార్గబోధినిపత్రికాధిపతియగు

ర. జగన్నాథయ్యగారిచే

చెన్నపురి:

హాంసర్ కంపెని, ముద్రాక్షరశాలయందు,

ముద్రింపంబడియె.

ప్రభవాదిదుర్ముఖినామసంవత్సరమునకుసరియైన

౧౮౯౬-వ సంవత్సరము.



దీనివెల, అణాలు ౪.

# ఓమ్.

## శ్రీమదఖండసచ్చిదానందకృష్ణపరబ్రహ్మణేనమః.

## పీఠిక.

శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్య శ్రీదత్తాత్రేయగురువర్యుని పారంపర్య శ్రీమత్సద్గురు సదానందసరస్వతీస్వాములవారి శిష్యులగు శ్రీమత్సద్గురు శాంతానందసరస్వతీస్వాములవారిన్నిసంశయనివృత్తికై ప్రశ్న చతుష్టయంబడుగ వాటికి శ్రీ సద్గురుస్వాములవారు కృపాతరంగితమతులై యానతిచ్చినయుత్తరముల ముముక్షువుల యుపయోగార్థము సన్మార్గబోధినిపత్రికం బ్రచురపఱచితిమి. బహుజనంబులిందలి విశేష విషయంబుల కానందించి పుస్తక రూపంబున నవియంతయుం జేర్చి ప్రచురించిన బహుప్రయోజనకారిగ నుండునని దెలియఁబఱచుటం జేసి ప్రకృతముపుస్తకరూపముగా బ్రచురింపబడియె. బ్రహ్మజ్ఞానజిజ్ఞాసులగు వారలుదీనంగల రహస్యార్థంబులం జదివి పరమానందభరితులగుదురని నమ్మెదము. మాబోటిపామరుల యజ్ఞానంబుచే నిందర్థదోషశబ్దదోషంబులేవైన నుండినగణింపక ముద్రించు నెడతటస్థించినవని యెన్ని మమ్మును మన్నించిహంసవిధంబున క్షీరగ్రహణంబుచే దనివినొంది సుఖింతురని గోరెదము.

ఓమ్.

# చతుర్వర్ణ ప్రశ్నోత్తరార్యోపదేశ బోధ దర్పణము

## జ్ఞానమునకధికారియెవరు

శ్లో॥ నావిరతోదుశ్చరితాన్నాశాన్తోనాసమాహితః।
నాశాన్తమానసోవాపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్॥

అను కఠోపనిషద్వాక్యరీతిని దుర్గుణములను వదలి యింద్రియ చలనములేక యేకాగ్రచిత్తముగలిగి యన్నిటియందు వ్యాపించని మనస్సుగల మనుష్యుఁడు, యీయాత్మనుజ్ఞానముచేత పొందుచున్నా డని సిద్ధించుచున్నది. దుర్గుణములనెవ్వి (రాగ, ద్వేష, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య, యీర్ష్య, అసూయ, దంభ, దర్ప, అహంకారము ను) పదుమూడు గుణములు. ఇందు పరస్త్రీ విషయముగ వచ్చెడు ) త్తవృత్తి రాగము. ఈగుణము వృద్ధిపొందినవానిని దివ్యజ్ఞానము, జపము, తపస్సు, ధనము, గొప్పతనము మొదలగునవి యన్నియు డిచిపెట్టి పోవుననుటకు ప్రమాణము. ("శ్రుతంసత్యంతపశ్శీలంవిజ్ఞానం త్త మున్నతిం। ఇంధనీ కురుతే మూఢః ప్రవిశ్య వనితానలం)" కఁడొనర్చిన యుపకారమునకు ప్రతియుపకారము చేయఁదలఁచు త్తవృత్తి ద్వేషము -- ఈ రాగ ద్వేషాదులు శత్రువు లనియు వీఁటికి రుషుఁడు స్వాధీనుఁడు గాఁగూఁడదనుటకు భగవద్వాక్యము.

"ఇంద్రియస్యేంద్రియస్యార్థేరాగద్వేషౌవ్యవసితౌ।
తయోర్నవశమాగచ్ఛేత్తౌహ్యస్యపరిపంధినౌ॥" (భ.యును -

గృహారామ క్షేత్రాదులను యెక్కువగ సంపాదింప వల
ననెడి యిచ్ఛయే కామము - ఈ గుణము జ్ఞాని కెప్పటి కిని శ
వనుటకు భగవద్వాక్యము. "జ్ఞానినో నిత్యవైరిణా కామరూపే
తనకార్యములకు విఘ్నపఱచినవారిని దండింపవలయుననెడి చిత్తవ
క్రోధము.ఈగుణము పాపమునకు కారణమనియు నిందుచేననేకదు
ములుప్రబలుననుటకుప్రమాణములు. "కోపఃపాపస్యకారణం" "క
క్రోధా దయస్తత్ర శత్రవశ్శత్రుసూదన" "తత్రాపి క్రోధఏవాలం మో
విఘ్నాయసర్వదా" "క్రోధమూలోమనస్తాపః క్రోధస్సంసారబంధ
ధర్మక్షయకరః క్రోధస్తస్మాత్క్రోధంపరిత్యజ" "క్రోధఏషమహాన్శత్రు
తనకులభ్యమైనపదార్థంబులుపరులకివ్వఁగూడదనుచిత్తవృత్తిలోభ
"లోభస్సర్వగుణాన్హన్తి" లోభము సమస్త మంచి గుణము
చెఱుచును. " కృపణస్య ధనం యాతి వహ్ని తస్కర పార్థివై
"చత్వారోవిత్తదా యాదాః ధర్మభూపాగ్నితస్కరాః। జ్యేష్ఠభ్రాత
మానేనత్రయఃకుప్యన్తిసోదరాః" సంపాదింపబడినద్రవ్యవిభాగమున
నలుగురు దాయాదులుగలరు.వారిలో జ్యేష్ఠుఁడు,దానము,కనిష్ఠు
రాజు, అగ్ని, చోరుడు. ఈధనమును త్రికరణ క్లేశములకో
యార్జించితాననుభవింపక, యొకరికి పెట్టక (పంటచేనికికావలియున
బొమ్మవలెయున్నపక్షమున) జ్యేష్ఠభ్రాతయగు ధర్మమునకువచ్చినయ
మానమునుసహింపక తక్కినముగ్వురుద్రవ్యమునునాశముచేయుదుర
అనగా, దొంగల పాలవును. లేక యగ్నిపాలవును. దుర్వ్యాజ్యము
సంభవించిరాజులపాలవును. అథవాపూడ్చిపెట్టిననేలపాలవును.

"లోభః ప్రతిష్ఠాపాపస్యప్రసూతిర్లోభ ఏవచ।
ః క్రోధాదిజనకోలోభః పాపస్యకారణం॥"
పాపమునకు మూలకారణము. ఆలోభ మే ద్వే
చేసి పాపంబును జెందునటులజేయును.

" లోభాత్క్రోధః ప్రభవతి క్రోధాద్ద్రోహః ప్రవర్తతే।
ద్రోహేణ నరకం యాతి శాస్త్రజ్ఞోపి విచక్షణః"

శాస్త్రజ్ఞుండైనను, విచక్షణుండైనను, లోభంబువలన క్రోధంబును క్రోధంబువలన ద్రోహంబును, ద్రోహంబువలన నరకంబును జెందుదురు- దారాపుత్రాదులయందు మిక్కుటపు ప్రేమయే మోహము - సమస్త భోగ భాగ్యములచే గర్వాంధుండై నేనేమి చేసినను చెల్లు ననెడి చిత్తవృత్తియే మదము - తనకంటె నెక్కువగ యైశ్వర్యము మొదలగు వాటిని యితరులుగలవారైయుండగాంజూచి యోర్వజాలకమండిపడు చిత్తవృత్తిమాత్సర్యము. ఇట్టి ఓర్వలేనితనము గలవానికి శత్రువులు లేకపోయినను అదేవానికి చాలినంత చేటును కలుగజేయును. ఈ గుణము కలిగియుండు వాడు తీవ్ర పాపి. వీనికి సౌఖ్యానుభవమును, చిత్తశాంతియు నుండదు, ఈ పరశ్రేయస్సహనము లేకుండుట వలన, మితిలేని దురవస్థలు గలుగును. అదెట్టులనిన ? దేవతలకు సుఖము గలుగ జేయుటకై, శ్రీ మహావిష్ణువు వామనావతారము ధరించి, బలిని మూండడుగుల పుడమిని దానమడుగ వాడు నిచ్చెదనని స్థాళినెత్తి యుదకము విడువబోగా రాక్షసగురువైన శుక్రాచార్యులు యెవ్విధంబుననైనను దేవతలు క్షేమమును బొందగూడదను నభిప్రాయముతోటి యోర్వలేని తనమును వహించి స్థాళియొక్క ముక్కుద్వారమందు యొక్క పురుగై యుదకము రాకుండునటుల నడ్డగించెను. అది శ్రీ మహావిష్ణువెఱింగి తమచేత దర్భపుల్లతో పొడిచి యా యసురగురువు యొక్క యేకాక్షిని పెఱిచెను. ఈ యోర్వలేని తనమే శుక్రుని యేకాక్షిగం జేసెను యెట్టివారలును యేవిధముననైనను " యద్యదైవాత్మాపరస్యద్యాత్ స్య శుభ మిచ్ఛతా " అనురీతిని తన్నెట్టులో అపగిదిని పరుల నుజూచుకొనలయును. ' కార్పణ్యము మానవలయును -

తనకు వచ్చిన కష్టము లితరులకు రావలయు నను తలంపు యీర్ష్య. తనకు గలిగిన సుఖము లితరులకు గలుగ రాదను తలంపు అసూయ. తాచేసినసత్కార్యములితరులెరిగిమెచ్చవలయుననుచిత్తవృత్తిడంభము. సమస్తవిషయములయందు సమర్థుడను, నాకు సాటియైనవారు లేదను చిత్తవృత్తి దర్పము -- నేనని గర్వించు చిత్తవృత్తి యహంకారము. "నాహంకారాత్పరోరిపుః" అహంకారమునకన్న వేఱు శత్రువులేదు. ఇది చెడువ్యాధి.దీనిని ఔషధముచే వేరు దెంపుటసాధ్యము.ఈవ్యాధి యొక్క ముఖ్యగుణము లేవియనిన వీపుయొక్క వెనుక భాగము మధ్యభాగమునువదలి కొంచెము పొర్లేయుండును. మాటలోదృఢముగాను, అభినయ సహితముగాను యుండును. వాడుదేవలోకము నుండి వచ్చి యొక యాధిక్యునివలెనే ప్రవర్తించును. ఈవ్యాధి విభజన యనెడు యౌషధము రెండు మూడు గురిగింజ లెత్తు ప్రయోగింపఁ జేసిన యెడల నివర్తింపబడును. ఈ యహంకారమను వ్యాధి భవరోగమును వృద్ధిజెందించును. మోక్షాపహారి-యితరమైన వారినిగూర్చి మనమెంతమాత్రము తలతుమోయంతమాత్రము వారు మనలనుగూర్చి తలతురను నిశ్చయము గలిగి ప్రవర్తించుటయే ఈవ్యాధి నివర్తికి స్వల్పవిలువగల యౌషధము.) ఇట్టిదుర్గుణములను వదలి "మేధావీపురుషోవిద్వానూహాపోహావిచక్షణః। అధికార్యాత్మవిద్యాయాముక్తలక్షణలక్షితః॥" "వివేకినోవిరక్తస్యశమాదిగుణశాలినః। ముముక్షోరేవహి బ్రహ్మజిజ్ఞాసాయోగ్యతామతా" "సద్బుద్ధిస్సాధుసేవీసముచితచరితస్తత్వబోధాభిలాషీ। శుశ్రూషుస్త్యక్తమానఃప్రణిపతనపరఃప్రశ్నకాలప్రతీక్షః। శాన్తోదాన్తోనసూయుశ్శరణముపగతశ్శాస్త్రవిశ్వాసశాలీ। శిష్యఃప్రాప్తఃపరీక్షాంకృతవిదభిమతంతత్వతశ్శిక్షణీయః"॥ "సాధనచతుష్టయసంపన్నోధికారి" అనుప్రమాణములరీతిని గ్రంథధారణశక్తిగలవాడును, పండితుడును, ఊహాపోహాలయందు

పరిశీలనగలవాఁడును (అపోహం=అబద్ధము. ఊహా=అట్టియబద్ధమును పోఁగొట్టునట్టిబుద్ధి) సదసద్వివేకచతురతఁగలవాఁడును వైరాగ్యముఁ గలవాఁడును, మోక్షేచ్ఛఁ గలవాఁడును. భవార్ణవమునుదాటుటకు సజ్జన సహవాసము తప్ప వేరు నావ లేదని వారిని యుపచరించు వాఁడును, తత్వబోధాభిలాష గలవాఁడును, లజ్జవదలినవాఁడును, ప్రశ్నకాలమును ప్రతీక్షించువాఁడును, ధనలుబ్ధుఁడు ధనమును కాపాడునట్లు శమదమాదులను సుగుణసంపదలను గాపాడుకొనువాఁడును, అసూయారహితుఁడును, శాస్త్రవిశ్వాసశాలివై యుండువాఁడును, దుష్టసాంగత్యమున పాపభీతియు, పుణ్యావాంఛయుక్షీణించునని వారి సాంగత్యము విడనాడి, యనవరతము సత్ప్రవర్తనఁగలవారితో కలసి మెలసియుండువాఁడును, "మద్య మదేయ మపేయ మగ్రాహ్యం" అను వాక్యరీతినిమద్యమును, నితరులకీయక, పానము చేయక, దాని నంటక యుండువాఁడును, చండవాయువులు, నావనుముంచినట్లు, యీమద్యము అనఁగా ఏవిధ లహరి పదార్థమైనను యుక్తాయుక్త జ్ఞానమును, నాశన పఱచునను తెలివి గలవాఁడును, గ్రహణచ్ఛాయ నుండి విముక్తమైన చంద్రబింబము పగిదిని దేహము మీదిమమకారమును వదలి "నిత్యమాత్మ స్వరూపంహిదృశ్యంతద్విపరీతకం" అనురీతిని రూపనామములు గల దృశ్యమయమైన ప్రపంచమనిత్యము అనఁగా నశించునట్టిదనిన్ని సర్వవిలక్షణమై వెలుగు పరబ్రహ్మము నిత్యమను సాధన చతుష్టయమందు మొదటిసాధనమైన నిత్యానిత్యవస్తువివేకముగలవాఁడును - 'ఇహ స్రక్చందనాది విషయభోగః అముత్ర అప్సరస్త్రీవిషయభోగశ్చ ఉభయమపి అనిత్యమితిశ్వావాంతాశన మూత్రపురీషాదివత్ తత్రవైరగ్యం"=ఇహలోకమందలి స్త్రీకుసుమచందనభూషణవస్త్రాదులు గృహారామక్షేత్రాదులును పరలోకమందుగలఊర్వసి, రంభ, తిలోత్తమ, మేనకల సందును, వైకుంఠకైలాసాదులయందలి సాలోక్యసామీప్యసారూప్య

త్సాయుజ్యాది పదవులయందుగల భోగములయందువమనాన్న మూత్ర పురీషాదులయందువలె నిచ్ఛలేక యుండవలె ననెడి రెండవసాధనమైన ఇహాముత్రార్థఫలభోగవిరాగమునుగలవాడును-"స్వదైకవాసనాత్యాగ శ్శమోయమితిశబ్దితః"మనస్సు, బుద్ధి, చిత్తము,అహంకారమనెడి అంత రింద్రియములు,వానివృత్తులైన సంకల్పవికల్ప నిశ్చయచంచల కర్తృత్వ ములు వీడియుండుట శమము. అనఁగాఅంతరింద్రియనిగ్రహము-

"నిగ్రహోబాహ్యవృత్తీనాందమఇత్యభిధీయతే"చతుర్విధశబ్దముల గ్రహించునట్టి శ్రోత్రేంద్రియమునుస్పర్శగ్రహణముఁగల త్వగింద్రియ మును,రూపములను గ్రహించునట్టి చక్షురింద్రియమును, రుచులను గ్రహించునట్టి జిహ్వేంద్రియమును, గంధములను గ్రహించెడి నాసికేంద్రియమును,వాక్కు పాణిపాదాదియింద్రియములను,విషయా దులనుండి మరలించుటయే,అనఁగా బాహ్యేంద్రియములగు జ్ఞానేం ద్రియ కర్మేంద్రియంబులనిగ్రహమే దమము. ఇట్టిబాహ్యేంద్రియ నిగ్రహము చేత పాపముతిరస్కరింపబడుచున్న దనుటకు తైత్తిరీయో పనిషద్వాక్యము. "దమేనదాన్తాః కిల్బిషమవధూన్వన్తి"-

"విషయేభ్యఃపరావృత్తిః పరమోపరతిర్హిసా" = విషయాదుల యందుచిత్తవృత్తినిబోనియ్యకబ్రహ్మనిష్ఠకువిఘ్నకరములగు, విహితం బులగు కర్మాదులను శాస్త్రోక్తంబుగవిడుచుట, లేదాచేసినను కర్తృ త్వాద్యభిమాన రహితుడై ఫలంబపేక్షింపక యీశ్వరార్పణంబుగ నొనర్చి బ్రహ్మనిష్ఠయందునుతప్పకనుండుట ఉపరతి.

"సహనం సుఖదుఃఖానాం తితిక్షా సా శుభామతా"ప్రారబ్ధ కర్మ వశంబున గలిగెడి సుఖదుఃఖ మానావమాన నిందాస్తుతి లాభాలాభ జయాపజయ జననమరణ శోకమోహ క్షుత్పిపాసాదులు మొదలగునవి యెయ్యేవేళలం దెయ్యెయ్యది సంభవించినను అనుభవించి తీరవలెనని బుద్ధియందునిశ్చయంబే తితీక్ష-

"చిత్తైకాగ్ర్యస్తుసంలక్ష్యేసమాధానమితిస్మృతం" "సర్వదా
యంబుద్ధేశుద్ధేబ్రహ్మణిసర్వదా।తత్సమాధానమిత్యుక్తంనతుచిత్తస్య
నం" వాసనలబలీయముచే విషయంబులయందే పోవుమనస్సును
పోనివ్వక ఆత్మ నిష్ఠ యందు స్థిరముగ నిలుపుట సమాధానవ
బ్రహ్మజ్ఞానానుభవముగలవారునుడివెదరు -

"నిగమాచార్యవాక్యేషుభక్తిశ్శ్రద్ధేతివిశ్రుతా"తనకుప్రయోజన
ముసుకలుగ జేయని సామాన్య శాస్త్రములను, స్వప్రయోజనముల
కాంక్షించెడి అనాచార్యులను విడిచి ప్రతిప్రయోజనముల నొల్లని సద్గ
రుమూర్తియందును, శ్రుతివాక్యములయందును విశ్వాసముకలిగియు
టే శ్రద్ధ- ఈశమాదిషట్కంబను మూడవసాధనముగలవాడును

వేటగానియురిలోచిక్కినలేడిదప్పించుకొనప్రయత్నించులాగున
చోరులకు, కృష్ణసర్పకాటుకు, వ్యాఘ్రాదిమృగములకు, వెరచిపరు
బిడువానివలెను- మిడమిడ్డగాసెడి,యెండలోదగిలిపరితపించుకీటకవ
శీతలోదకముగలకొలను జేరగోరు విధమునను- ఇల్లుచుట్టును గా
చుండగా ఆయింటనుండుపురుషుడుతప్పించుకొనిపోవలెననిపరితపి
సదుపాయము వెదకులాగున-అనాదికాలముగ నేననంత జన్మముల
బ్రహ్మజ్ఞానమును తదనుగుణమగు ననుష్ఠానమును లేక దుర్వాసనల
నజ్ఞుడై ఇంద్రియకింకరుడై బ్రహ్మవిచారమును, అల్లమనివర్జించి,క్షుద్ర
పురుషార్థములను బెల్లమనిమనోరథించుచుంటిని హాహా! మోసబోతిని
ఈసంసారాగ్ని యొక్క గనగనమండుచుండెడు త్రివిధతాపములనెడు
నగా ఆధ్యాత్మిక,ఆధిభౌతిక,ఆధిదైవికమనెడి మంటలోజిక్కి బయలు
వేరలేకపరితపించుచుండునన్ను యేసద్గురుమూర్తితనకరుణారసమనెడు
ల్లని నీటిముంచి మహావాక్యోపదేశముచే కృతార్థుని జేయునోయ
ర్వకాలసర్వావస్థలయందును గోరుచు, పరిపక్వకాలమున తనకు

...యగుసువలె ననవరతము కూడియుండి, వృక్షమూలమున నీరుపోసిన
...రీఫలమిచ్చునట్లు పరమ భక్తియుక్తుడై శుశ్రూష జేయుచు
ఇహా...ష్టంబుబొందుటకిచ్ఛయుంచుటయే తీవ్రమోక్షేచ్ఛ. నాలుగవసాధ
...నమై... ఇట్టిముముక్షుత్వంబుగలిగినవాడును- మీదజెప్పిన సద్గుణములు
...త్రి...డే బ్రహ్మజ్ఞానమునకు అధికారియని శ్రుతిస్మృత్యాది ప్రమాణముల
ముల...గుణ్యమైనతమస్వానుభవమునుబట్టి బ్రహ్మవేత్తలువక్కాణించెదరు.

“...లుడు ఎంతటిప్రవీణుడైననుతనకుసాధనములైనదండచక్రాదులలో
...టిలేకయున్నను, ఘటమునునిర్మింపలేనట్లు పై లక్షణములు లేకున్న
ము...హ్మజ్ఞానముకలుగదు. ఇట్టిసద్గుణసంపదయు, నిత్యానిత్యవస్తువివేకాది
...సర్విధసాధనములేక, జ్ఞానమునుబొందుటకై చేయు బ్రహ్మవిచారము
నా...గతో భుజించినఅన్నమునకుసదృశమగుననుటకుసందియము లేదు. ఇట్టి
ధ...ధికారికి ప్రత్యగాత్మవిషయసంశయముగలుగును. ఆసంశయమునకుని వ
...త్తిశ్రవణమనననిదిధ్యాసములద్వారా కలుగునని బ్రహ్మవేత్తలందురు.

## ...పని ప్రత్యగాత్మ విషయ సంశయం బెట్టిది?



యం: సంశయంబనగా వస్తుద్వయంబొక దానియందారోపించుట.
...నగా కొమ్మలు ఆకులు లేని యొక చెట్టును చూచి చోరుడో
...లేక స్థాణువో అనెడి చిత్తవృత్తి- ఇటువలెనే శ్రుతిస్మృతి
...సహస్రంబులైక కంఠ్యముగా బ్రహ్మేతరము లేదని ఘోషించినను
దేహేంద్రియాదులతోగూడి భోక్త కర్తనైయున్ననాకు అద్వితీయ
బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమెట్లులభించుననియు, అట్లు సిద్ధించినపక్షమున
...దేహత్రయములు లేక యుండవలెగదా యనియు. యేలనగా
“స్థూల సూక్ష్మ కారణ శరీర త్రయ విలక్షణః పంచకోశ వ్యతిరిక్తః
...వస్థాత్రయసాక్షీ సచ్చిదానంద రూపః” అను ప్రమాణ రీత్యా

గనుక నాకెట్లు సాక్షాత్కారజ్ఞానము సిద్ధించు ననియు మరియు "నతత్రసూర్యోభాతినచంద్ర తారకంనేమావిద్యుతోభాన్తికుతోయ మగ్నిః" "యతోవాచోనివర్తన్తేఅప్రాప్యమనసాసహ" "నతత్రచక్షుర్గ చ్ఛతినవాగ్గచ్ఛతినోమనః" "అపాణిపాదోహమచిన్త్యశక్తిః" అనుశ్రుతి స్మృతులచేస్వప్రకాశుడగుటవలనయింద్రియాతీతత్వముకరచరణాద్యవ యవ సహితదేహేంద్రియోద్యుపాధి శూన్యత్వము మొదలగునవిపర బ్రహ్మలక్షణములు. అవినాయందులేవు. నేనెట్లుపరబ్రహ్మమగుదును. " పూర్ణమదఃపూర్ణమిదంపూర్ణాత్పూర్ణముదచ్యతే" "నచాన్తర్నబహి ర్యస్య నపూర్వోనాపిచాపరంబహిశ్చాంతర్జగతో యోజగచ్ఛయః" "బ్రహ్మైవేదమమృతంపురస్తాద్బ్రహ్మపశ్చాత్" "సర్వంఖల్విదంబ్రహ్మ" "పురుషఏవేదగ్ంసర్వం" "విశ్వమేవేదంపురుషః" ఇట్టిశ్రుతిస్మృతులచే పరబ్రహ్మముఅంతటనిండియున్నదని తెలియబడుచుండగాఎక్కడనో ఒకమూలనున్న నేనెట్లుపరబ్రహ్మమగుదును ? మరియు, "సత్యంజ్ఞాన మనన్తంబ్రహ్మ" అనిబ్రహ్మలక్షణముచెప్పియుండ, జననమరణములుగల నేనెట్లుపరబ్రహ్మమగుదుననిశంకించుటప్రత్యగాత్మవిషయసంశయము, ఈసంశయము శ్రవణమనన నిది ధ్యాసములవలన నివర్తియగును. మొట్టమొదట యిట్టి సంశయోత్పత్తికలిగిన నాకరిశరీరమునేవిచారిం చుదము. శరీరమను పదమునకు తల, గొంతు, చెయ్యి, రొమ్ము, నడుము, కాలు మొదలగు అవయవములే యున్నవి. ఈ యవయవములు తప్ప శరీరమను అవయవికి వస్తుత్వము లేదు. అవయవములు చేరియే, శరీర మాయె ననిన. అవయవములు చేరినను అవయవములుండునేగాని శరియొక్కటి రాదు. తల మొదలగునవి అవయవములు . శరీరము అవయవి, అవయవములు గానుండు కాలమునను, అవయవిగానుండు కాలమునను అవయవములు తప్ప వేరువస్తువు లేదుగదా, అవయవ ములు తలమొదలగునవి, అవయవి, శరీరమను కాలమునను [illegible]

తల మొదలగునవేయున్నవి. వేరువస్తువయుండుననిన ఆవస్తువయొక్కటి గా చేరుటకు ముందులేదు. వేరు వేరుగా విభజించిన అనంతరము లేదు. ముందువెనుకలేనిది మధ్యయెట్లువచ్చును ? వచ్చినదనిన, లేనిదిరాదు. అను న్యాయమునకు విరోధమేను. లేనిది వచ్చునని ఒప్పుకొనిన, వంధ్యాపుత్రుడుకలుగవలెను. అట్లుకలుగుటలేదుగనుక లేనిది లేనిదేను. అట్లే అవయవములు చేరి నపుడును అవయవ ములు మాత్రమే యున్నవి. అవయవియనుట శబ్దమాత్రమున్ను, తోచుటయేను, గాన అవయవములయందును, అవయవియందును, తల మొదలగున వేయున్నవి. వేరొకటి రాలేదు. రాను రాదు. అయితే శరీర మనునది యొకటి అగుపడుచున్నదే యనిన, అగుపడుట నిశ్చయమేను. అగుపడలేదని యెవరుచెప్పరు. ఐనను అదిసత్తాయనిన ? వస్తుత్వము లేదుగాన సత్తుకాదు. అసత్తాయనిన ? ఆకాశ తామరవలె బొత్తిగా లేకపోలేదుగాన అసత్తు కాదు. సదసత్తోయనిన వున్నది, లేదు, అని రెండు ధర్మములు గలది యెచ్చటయును లేదుగాన సదసత్తని చెప్పందగదు. ఇట్లు చెప్పినపోవు గతియెట్లనిన ? గానుగఅని శివలింగమని తెలుసుకొనక, మైకము జెంది యుండువారికి అనిర్వచనీయ మనిన్ని పైజెప్పబడిన అవయవములును పంచీకృత అపంచీకృత భూతములకూటమియేయనిన్ని, వాటికిఆదిస్థితి అణువేయనిన్ని, ఆయణువుదృశ్యమేయనిన్ని, ఆదృశ్యముఆకాశమునకు అన్యముకాదనిన్ని, ఆకాశముతనకుకారణమైనబ్రహ్మమందే లయించునని న్ని, శేషించునదిసత్యజ్ఞానానంతస్వరూపమేయనిన్ని, అదియేతాననిన్ని అట్టితన్మయదశయందు శోధించినరీతిని శరీరేంద్రియాంతః కరణజీవభావ ము లేక, జ్ఞాతృజ్ఞానజ్ఞేయదృశ్యములు లేక, అదియేతానను సూక్ష్మసంకల్ప ము చెడి ప్రజ్ఞామాత్రముగానుండు, అనుభవవేద్యునికి లేనిది లేనిదేను. మరియు శ్రీవిష్ణుపురాణమునందు సౌవీరమహీపతికి భరతుండు చేసిన బ్రహ్మోపదేశంబును, మననము చేసి నిదిధ్యాసనమునకు దెచ్చుకొనుము.

# ఆ తత్త్వోపదేశం ఎట్టిది ?

విలోక్యనృపతిస్సోఽపి విషమాంశిబికాగతిమ్।
కిమేతదిత్యాహసమంగమ్యతాంశిబికావహాః॥
పునస్తథైవశిబికాంవిలోక్యవిషమాంహసన్।
నృపఃకిమేతదిత్యాహభవద్భిర్గమ్యతేఽన్యథా॥
భూపతేర్వదతస్తస్యశ్రుత్వేత్థంబహుశోవచః।
శిబికోద్వాహకాః ప్రోచురయంయాతీత్యసత్వరమ్॥

రాజోవాచ॥ కింశ్రాంతోఽస్యల్పమధ్వానంత్వయోఢాశిబికామమ।
మమాయాసవిహీనస్త్వంపీవానసినిరీక్ష్యసే॥

బ్రాహ్మణః॥ నాహంపీవాననైవోఢాశిబికాభవతోమయా।
నశ్రాన్తోఽస్మినచాయాససోఢవ్యోఽస్తిమహీపతే॥

రాజా॥ ప్రత్యక్షందృశ్యసేపీవానాద్యాపిశిబికాత్వయా।
శ్రమశ్చభారోద్వహనేభవత్యేవహిదేహినామ్॥

బ్రాహ్మణః॥ ప్రత్యక్షంభవతాభూపయద్దృష్టంమమతద్వద।
బలవానబలశ్చేతివాచ్యంతస్తాద్విశేషణమ్॥
త్వయోఢాశిబికాచేతిత్వయాద్యాపిచసంస్థితా।
మిథ్యైతదత్రతుభవాన్శృణోతువచనంమమ॥
భూమౌపాదయుగావస్థాజంఘేపాదద్వయేస్థితే।
ఊర్వోర్జంఘద్వయావస్థౌతదాధారంతథోదరమ్॥
వక్షస్థలంతథాబాహుస్కంధౌచోదరసంస్థితౌ।
స్కంధాశ్రితేయంశిబికామమాధారోఽత్రకఃకృతః
శిబికాయాంస్థితశ్చాయందేహస్త్వద్యుపలక్షితః।
తత్రత్వమహమప్యత్రప్రోచ్యతేచేత్తదన్యథా॥
అహంత్వంచతథాన్యేచభూతైరూహ్యామపార్థివ।
గుణప్రవాహపతితోభూతసర్గోఽపియాత్యయమ్॥

కర్తృవశ్యాగుణాహ్యేతేసత్త్వాద్యాఃపృథివీపతే।
అవిద్యాసంచితంకర్మతచ్చాశేషేషుజన్తుషు॥
ఆత్మాశుద్ధోఽక్షరశ్శాన్తోనిర్గుణఃప్రకృతేఃపరః।
ప్రవృద్ధ్యపచయౌనస్తఏకస్యాఖిలజన్తుషు॥
యదానోపచయస్తస్యనచైవాపచయోనృప।
తదాపీవానసిత్యేతత్కయాయుక్త్యాత్వయేరితమ్॥
భూపాదజంఘాకట్యూరుజఠరాదిషుసంస్థితే।
శిబికేయంయథాస్కంధేతథాభారస్సమస్త్వయా॥
తదాన్యజన్తుభిర్భూపశిబికోత్థానకేవలమ్।
శైలద్రుమగృహోత్థాపిపృథివీసంభవాపిచ॥
యదాపుంసఃపృథగ్భావఃప్రాకృతైఃకరణైర్నృప।
సోఢవ్యస్తుతదాహంసఃకథంహిన్నృపతేమయా॥
యద్ద్రవ్యాశిబికాచేయంతద్ద్రవ్యోభూతసంగ్రహః।
భవతోమేఖిలస్యాస్యమమత్వేనోపబృంహితః॥
శ్రీపరాశరః॥ఏవముక్త్వాభవన్మౌనీసవహన్ శిబికాంద్విజః।
సోపిరాజావతీర్యోర్వ్యాంతత్పాదౌజగృహేత్వరన్॥
భోభోవిసృజ్యశిబికాంప్రసాదంకురుమేద్విజ।
కథ్యతాంకోభవానత్రజాల్మరూపధరస్థితః॥
యోభవాన్యన్నిమిత్తంవాయదాగమనకారణమ్।
తత్సర్వంకథ్యతాంవిద్వన్మహ్యంశుశ్రూషవేత్వయా॥
బ్రాహ్మణః॥శ్రూయతాంసోహమిత్యేతద్వక్తుంభూపనశక్యతే।
ఉపభోగనిమిత్తంచసర్వత్రాగమనక్రియా॥
సుఖదుఃఖోపభోగౌతౌతౌదేహాద్యుపపాదితౌ।
ధర్మాధర్మోద్భవౌభోక్తుంజన్తుర్దేహాదిఋచ్ఛతి॥
సర్వస్యైవహిభూపాలజన్తోస్సర్వత్రకారణమ్।

ధర్మాధర్మాయతః కస్మాత్కారణంపృచ్ఛతేత్వయా॥
రాజోవాచ। ధర్మాధర్మానసందేహాస్సర్వకార్యేషుకారణమ్॥
ఉపభోగనిమిత్తంచదేహాద్దేహాన్తరాగమః॥
యత్త్వేతద్భవతాప్రోక్తంసోహమిత్యేతదాత్మనః।
వక్తుంనశక్యతేశ్రోతుంతన్మమేచ్ఛాప్రవర్తతే॥
యోస్తిసోహమితిబ్రహ్మన్కథంవక్తుంనశక్యతే।
ఆత్మన్యేషనదోషాయ శబ్దోహమితియోద్విజ॥
బ్రాహ్మణః॥ శబ్దోహమితిదోషాయనాత్మన్యేషతథైవతత్।
అనాత్మన్యాత్మవిజ్ఞానంశబ్దోవాభ్రాన్తిలక్షణః॥
జిహ్వాబ్రవీత్యహమితిదంతోష్ఠంతాలుకంనృప।
ఏతేనాహంయతస్సర్వేవాఙ్నిష్పాదనహేతవః॥
కింహేతుభిర్వదత్యేషావాగేవాహమితిస్వితా।
తతఃపీవానసీత్యేతద్వక్తుమిత్థంనయుజ్యతే॥
పిండఃపృథగ్యతఃపుంసశ్శిరఃపాణ్యాదిలక్షణః।
తతోహమితికుత్రైతాంసంజ్ఞాంరాజన్కరోమ్యహమ్॥
యద్యన్యోస్తిపరఃకోపిమత్తఃపార్థివసత్తమ।
తదేషోహమయంచాన్యోవక్తుమేవమపీష్యతే॥
యదాసమస్తదేహేషుపుమానేకోవ్యవస్థితః।
తదాహికోభవాన్కోహమిత్యేతద్విఫలంవచః॥
త్వంరాజాశిబికాచేయంవయంవాహాఃపురస్సరాః।
అయంచభవతోలోకోనసదేతన్నృపోచ్యతే॥
వృక్షాద్దారుతతశ్చేయంశిబికాత్వదధిష్ఠితా।
వృక్షసంజ్ఞాయతస్తస్యాందారుసంజ్ఞాథవాన్నృప॥
వృక్షారూఢోమహారాజానాయంవదతితేజనః।
నచదారుణిసర్వస్త్వాంబ్రవీతిశిబికాగతమ్॥

శిబికాదారుసంఘాతో రచనా స్థితిసంస్థితః।
అన్విష్యతాంనృపశ్రేష్ఠతద్భేదేశిబికాత్వయా॥
ఏవంఛత్రశలాకానాంపృథగ్భావోవిమృశ్యతామ్।
క్వజాతంఛత్రమిత్యేషాన్యాయస్త్వయితథామయి॥
పుమాన్‌స్త్రీగౌరియంవాజీకుంజరోవిహగస్తరుః।
దేహేషులోకసంజ్ఞేయంవిజ్ఞేయాకర్మహేతుషు॥
పుమాన్నదేవోననరోనపశుర్నచపాదపః।
శరీరాకృతిభేదాస్తుభూపతేకర్మయోనయః॥
వస్తురాజేతియల్లోకేయచ్చరాజభటాత్మకమ్।
తథాన్యచ్చనృపేత్థంతన్నసత్యంకల్పనామయమ్॥
యత్తుకాలాన్తరేణాపినాన్యసంజ్ఞాముపైతివై।
పరిణామాదిసంభూతాంతద్వస్తునృపతచ్చకిమ్॥
త్వంరాజాసర్వలోకస్యపితుఃపుత్రోరిపోరిపుః।
పత్న్యాఃపతిఃపితాసూనోఃకంత్వాంభూపవదామ్యహమ్॥
త్వంకిమేతచ్ఛిరఃకింతుఉరస్తవతథోదరః।
కిముపాదాదికంకింత్వంతవైతత్కింమహీపతే॥
సమస్తావయవేభ్యస్త్వంపృథగ్భూతోవ్యవస్థితః।
సోహమిత్యత్రనిపుణంభూత్వాచిన్తయపార్థివ॥

తా॥ సవ్వీరమహారాజు శిబికను మోయువార్లనుజూచి నా వచనంబు పాటింపక విషమంబుగా నేటికింజనియెదరనెను. వారలు ఆ రాజునుజూచి దేవా ! మేమందరము సత్వరంబుగా సమగతిం జనుచున్న వారలము. మాలోనస్థూలాంగుండైన జడుండొక్కండు,మెల్లన నరుగుచున్నాడనిరి. అప్పుడురాజుజడభరతునింజూచికొంతదూరంబు శిబికమోచితివి, ఇంతలోబడలిక నొందితివే అతిస్థూలుండవైకేనంబడుచున్నాడవే,ఆయాసంబే మిటికి సహింపవుయనెను. అప్పుడుజడభరతు

లిట్లనిరి. బుద్ధి విశారదుడవైన ఓరాజా ! నేను బలిసినవాడంగా శిబికనా చేవహింపబడినదియుగాదు. భ్రమరూపుడనుగాను.నాకుఆయ సహేతువులైన కార్యంబులేమియులేవనెను. అప్పుడు అతనిని రా చూచి ప్రత్యక్షంబుగా స్థూలరూపంబున అగుపడుచున్నావు. నీమ పున శిబికయున్నది. బరువువహించుటవలన ప్రాణులకు శ్రమమ కలుగుట, లోకప్రసిద్ధంబనెను,అంతటభరతుడు రాజునుజూచి, రాజా బలవత్వంబు, దుర్బలత్వంబనియెడు విశేషంబు లటుండనిమ్ము, నీవు ప్రత్యక్షముగా చర్మచక్షువులతో జూచిన పదార్థంబులెల్ల నెరింగించెద వినుము. నీమూపున శిబికయున్నయది నీచేశిబిక వహింపబడుచున్న యదియని నీవుపలికిన వాక్యములు మిథ్యలని తలంపుము. ఎట్లనిన ? పాదంబులను భూమిభరించుచున్నది. అనగా భూమిమీద పాదములు, పాదములమీదపిక్కలు, పిక్కలమీద నూరువులు లేకతొడలు,ఊరువుల మీద వుదరంబును, వుదరంబుమీద వక్షస్థలంబును, వక్షస్థలంబుమీద భుజంబులును, బాహువులమీద భుజశిరంబులునుండ, దానిమీద శిబిక యున్నది. అట్టిశిబికవలన వచ్చిన భారంబును శరీరంబంతయు నను భవింపుచున్నది. ఇట్లుభారంబును వహించుశరీరంబును భూమిమోయు చున్నది. నిన్నును నన్నును, భూమిభరించుచుండగా, నాకుబరువు యెందువలన కలుగును. నీకు ఆధారంబైన దేహంబు శిబికయందున్న యది. ఆదేహంబునందు నీవుయున్నవాడవు. అద్దేహంబున నేనును వసించెదను.ఇవ్విధంబునసిద్ధంబైయుండుశిబికనీచేవహింపబడుచున్నదని మిథ్యావచనంబులు యేమిటికింబలికెదవు. నేనును, నీవును బ్రహ్మాది పిపీలికాంతంబులైన జీవ సమూహంబులును, స్థావరాంతంబులును, పృథివ్యాది భూతసంఘంబులచే వహింపబడుచున్నాము. కరచరణా ద్యవయవరూపంబులైనభూతంబులకుగమనాగమనాదిక్రియావైషమ్యం బెట్లు కలిగె నంటి వేని ఎరింగించెద వినుము. పంచ భూతముల్లు

సత్త్వరజస్తమోగుణంబులనియెడు మహాప్రవాహంబునంబడిత త్తద్గుణాను సారంబుగా ప్రవర్తిల్లుచున్నయవి. అనాదికర్మవశంబులైనసత్త్వాది గుణములును కర్మదేహాత్మ భ్రమరూపంబైన అవిద్యవలనంబొడమె. అవిద్యా సంపాదితంబైన కర్మ సూత్రంబున, అఖిల జంతు జాలంబు కట్టబడియున్నయది, ఇది అటుండనిమ్ము. ఇక ఆత్మలక్షణంబు వినుము. ఆత్మనిత్యుడు, శాంతుడు, క్షుత్పిపాస శోకమోహాది గుణరహితుండు, ప్రకృతికి మీఱి వెలుగువాడు, దేహాదులవలె అనేక ద్రవ్యమయుండు గాక గగనమువలె యేకస్వరూపుండై దేవాసురమనుష్యస్థావరాదుల యందు, స్థూల దృష్టికి భిన్న భిన్నంబుగా అగుపడుచు వాటికి కలుగు వృద్ధిక్షయాదులు లేకుండువాడుగాన అట్టి ఆత్మను స్థూలాకారుండు అని యెట్లుపలికితివి. భూమియు, పాదములు, పిక్కలు, ఫుదరంబు, బాహువులు మొదలగువానిమీదనున్న మూపుపై, అగుపడునట్టి శిబిక వలన గలిగిన బరువు నాకుగలిగెనేని అదినీకును సమస్తచేతనులకు యేలలేదు. మరియు భారంబు వహించుటయ్య, నిజంబని తలచితివేని, శిబికావహన సంభూతంబైన భారంబొక్కటియే యననేల ? కానన సమేతంబైన నిఖిల వసుమతీచక్రభారంబునుమనదిగా తలంపవలయు. భూత మయంబులైన కర చరణాద్యవయవంబుల కంటె, పురుషుండు వ్యతిరిక్తుండైయుండ భారవహన జన్యంబైనఆయాసంబెవ్వనికి! మరియు శిబిక యే ద్రవ్యంబులచే నిర్మితంబయ్యెనో ఆ ద్రవ్యంబుల చేతనే నీశరీరంబును, నాశరీరంబును సకలభూత గాత్రంబులును నిర్మితంబులై మమతాహంకృతులకాస్పదంబులైయున్న యవియని పలికి భరతుడు మౌనముదాల్చిశిబికవహించియుండెను.అంతటరాజుత్వరగాశిబికనుండి ది... ...హాత్ముని చరణారవిందంబులకు సాగిలి మ్రొక్కి,విప్రోత్తమా! ...ుము. నాయెడఁ గరుణింపుము. అజ్ఞానంబున నీచే నిట్టి చగె... ...ని బహు విధంబుల్ మొఱ బెట్టుచు, నీవెవ్వండవు ?

చర్మరూపంబునంజను దెంచియిచ్చట నెందుకున్నావు ? ఏమిప్రయోజనం బుగా నెచటికింజని యెదవు? నీశిష్యుండైననాకుయీవృత్తాంతంబంతయు విశదంబుగ నానతిమ్మనెను. అందుకాభరతుండు ఓరాజా! సావధానం బుగావినుము. నీవుయెవ్వడవనియడిగితివి ? ఆత్మకు జాతి,కుల,గోత్ర, నామధేయాది విశేషంబులెవ్వియును లేవుగాన నేనిట్టివాడనని యెడివచ నం బుచ్చరింపగూడదు.ఏమిప్రయోజనంబుగా యెచ్చటికింజని యెదవని అడిగితివి? ప్రారబ్ధకర్మానుభవ నిమిత్తంబున నెల్లదిక్కులకుంజనవలయు. దేహేంద్రియ జన్యంబులైన ధర్మాధర్మంబులవలననైన సుఖదుఃఖంబుల ననుభవించుటకై జీవుండు దేహేంద్రియాదులనొందు.

ఓరాజా ! సకలజీవులకుధర్మాధర్మములేసమస్తసుఖదుఃఖాను భవంబులకు కారణంబులైయుండుగాన, ఆగమనప్రయోజనంబు వేరే యడుగనేలయనెను.అతంటరాజుభరతునింజూచి.అయ్యా! సకలకార్యం బులకుధర్మాధర్మంబులుకారణంబులనుటకును, దేహాంతరప్రాప్తికర్మ ఫలానుభవార్థంబనుటకును, సందియంబులేదు.తానుయిట్టివాడనియెడి శబ్దంబెయ్యెడం ప్రయోగింపగూడదని సెలవిచ్చితిరే దానివిశదంబుగా ఆకర్ణింపగోరెద. దేహంబునందు అహంశబ్దవాచ్యంబైన పదార్థం బొక్కటికలుగుట నిజంబేని సోహమనియెడు వచనంబేమిటికిం బలుకం గూడదు. ఆత్మ అహంశబ్దవాచ్యంబని ప్రయోగించుటవలన దోషంబు లేదని తోచుచున్నదియని రాజుచెప్పెను. భరతుండు, ఓరాజా! ఆత్మ అహంశబ్దవాచ్యుండనుటవలన దోషంబులేదనుట నిజంబు. ఆత్మవ్యతిరి క్తంబైన అర్థంబునందు ఆత్మబుద్ధియు, అహంశబ్దప్రయోగంబును భ్రమ యని తలంచుము. నాలుక, దవడలు, పెదవులు మొదలగువాటివ్యా పారముచేతఅహమను శబ్దంబు నుచ్చరింపవచ్చునుగాని, అహమను శ బ్దార్థంబును దెలిసికొనుట మిగులదుర్లభంబు. కాబట్టినాలుక మొదలగు వి అహమనుశబ్దంబునకు స్వరూపంబులుగావు. ఈవిధంబునబాహ్యా

ద్రియంబులనెల్ల ఆత్మగాదనితలంచుము. శబ్దార్థంబులకును. గుణగుణు లకును, భేదంబులేదనియెడు పక్షంబంగీకరించి జిహ్వాదంతోష్ఠాదిసాధ నంబుల చేనైన వచనంబు, అహం శబ్దవాచ్యంబైన నిజస్వరూపంబు పలుకుచున్నయదియనిఅంటివేనిబలిసినవాడవై కనబడుచు నున్నవాడ వనియెడి వచనంబుపలుకఁగూడదు. మనోవ్యాపార జన్యంబైనవచనం బునకు ఆత్మత్వంబెక్కడిది? ఇంద్రియంబులకాశ్రయంబునుభూతసంఘ మయంబునగుదేహంబుఆత్మయనితలంపకుముశిరఃపాణిపాదాద్యవయవవిశి ష్టంబుపురుషునికంటెభిన్నంబైప్రత్యక్షంబుగ్గాగనబడునట్టిదేహంబునకు ఆత్మత్వంబుయెవ్విధంబునంబలుకనగును ? గాన అహమనియెడిశబ్దంబు యెందునుంప్రయోగింపగూడదు.ఓరాజా!ఉత్తమత్వహీనత్వాదిధర్మం బులవలన భిన్నుండై తనకరణిజ్ఞానైకాకారుండుగానిపురుషుడు వేరొ క్కడు జగంబునం గలండేని నేనిట్టివాడ, నతండిట్టివాడని పలుకనగు సమస్తచేతనులనుయేకరూపంబుగా దేవమనుష్యతిర్యక్స్థావర దేహంబు లందున్నవారలుగాన, నీవెవ్వండవని యడిగిన నేనిట్టివాడననిప్రత్తరం బెట్లుపలుకగలవాడ ఓరాజా!నీకుఆధారంబైనయీశిబికనీవుగానియట్లు దేహంబునునీవుగావు. నేను, నీవును, నీపరిజనులు మొదలగువారందరు సచ్ఛబ్దవాచ్యులని •యెఱుంగుము. ఓరాజా ! వృక్షంబువలన దారువౌ డమె. దారువువలన యీశిబిక నిర్మింపఁబడియె. దీనికియిపుడువృక్షంబు దారువనునామధేయంబులు లేనట్లు జనులునిన్ను శిబికారూఢుఁడని పలుకుచున్నవారలుగానివృక్షారూఢుండనియు,దారువునధివసించియు న్నవాడనియుంబలుకరు,యోచించుము. ఈశిబికదారుసంఘాతరచనా విశేషంబే గాని వేరొక్కటిగాదుగదా. ఈవిధమునయిద్దారువులనెల్ల ప్రత్యేకంబుగా విభాగించిన పక్షమున, దీనికి శిబికత్వంబు గలదేయని ఓపికతో విచారింపుము. మఱియు, అనేక వేణుసలాకులు అడ్డంబు నిడుపునుంగా రచింపఁబడి, ఛత్రంబని వ్యవహరింపంబడుచున్నయవి.

వానినెల్ల ప్రత్యేకంబుగాపీడదీసిన, వానికిఛత్రంబను సంజ్ఞకలుగునా ? కలుగదనే అంగీకరించవలయును. అట్లేపంచభూతంబులును,పరిణామ విశేషంబువలన,నాదేహంబు,నీదేహంబుఅనివ్యవహరింపంబడును,ఆవ్యవహారంబు లౌకిక దృష్టికిసరేను.పరమార్థ దృష్టికి సరికాదు అదిపరమార్థభావమునుకాదు. ఆత్మ, యక్ష రాక్షస భూత భేత్తాళాది జాతియు, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర మనుష్యజాతియు, పశు పక్షితిర్యగ్జాతియు, వృక్షలతాది జాతియుగాదు. దేవ మనుష్యాది జాతులు స్థూలోపాధిచే ఆత్మయందు ఆరోపమాత్రమేగాని సత్యంబుగాదు. కాననేనట్టివాడనియెట్లుపలుకుదును ? రాజు, రాజభటుండు, అన్యుండు అనియేదివ్యవహరింపంబడునో, అవ్వస్తువు అహంశబ్దవాచ్యంబుగాదని యెఱుంగుము.ఎద్దికాలాంతరంబునపరిణామాదిసంభూతంబైనమరియొకసంజ్ఞంజెందదో,అవ్వస్తువుసచ్ఛబ్దవాచ్యంబు,(త్రికాలాబాధ్యంసత్యం) అనగాఆత్మ. నీవురాజ్యమునకురాజుగాను, తండ్రికికొమారుడుగాను, శత్రువునకుశత్రువుగాను, భార్యకుభర్తగాను, కొమారునికితండ్రిగాను, వున్నావే నీవు యెవరనినాకు చెప్పుము.అదిగాక, నీవు శిరసా, కంఠమా, కడుపా, పాదాదులా, సమస్త అవయవ ములకంటె ప్రత్యేకుడవా ? నిన్ను; యెవరని కొంతఆలోచించి చెప్పుమా ? ఇవ్విధంబున తత్వంబున నిశ్చితంబై యితర వ్యావృత్తివలన దెలియదగిన ఆత్మను యిట్టివాడనియెవ్విధంబున బలుక శక్యంబగును.

శ్రీపరాశరః॥నిశమ్యతస్యేతివచఃపరమార్థసమన్వితమ్।

ప్రశ్రయావనతోభూత్వాతమాహనృపతిర్ద్విజమ్॥

రాజోవాచ॥భగవన్యత్త్వయాప్రోక్తంపరమార్థమయంవచః।

శ్రుతేతస్మిన్భ్రమంతీవమనసోమమవృత్తయః॥

ఏతద్వివేకవిజ్ఞానంయదశేషేషుజన్తుషు।

భవతాదర్శితంవిప్రతత్పరంప్రకృతేర్మహత్॥

నాహంవహామిశిబికాంశిబికానమయిస్థితా।
శరీరమన్యదస్మత్తోయేనేయంశిబికాకృతా॥
గుణప్రవృత్త్యాభూతానాంప్రవృత్తిఃకర్మచోదితా।
ప్రవర్తంతేగుణాశ్చైతేకింమమేతిత్వయోదితమ్॥
ఏతస్మిన్పరమార్థజ్ఞమమశ్రోత్రపథంగతే।
మనోవిహ్వలతామేతిపరమార్థార్థితాంగతమ్॥
పూర్వమేవమహాభాగకపిలర్షిమహంద్విజ।
ప్రష్టుమభ్యుద్యతోగత్వాశ్రేయఃకిన్న్వత్రసంశయమ్॥
తదంతరేచభవతాయదిదంవాక్యమీరితమ్।
తేనైవపరమార్థార్థంత్వయిచేతఃప్రధావతి॥
కపిలర్షిర్భగవతస్సర్వభూతస్యవైకిల।
విష్ణోరంశోజగన్మోహనాశాయోర్వీముపాగతః॥
సఏవభగవాన్నూనమస్మాకంహితకామ్యయా।
ప్రత్యక్షతామత్రగతోయథైతద్భవతోచ్యతే॥
తన్మహ్యంప్రణతాయత్వంయచ్ఛ్రేయఃపరమంద్విజ।
తద్వదాఖిలవిజ్ఞానజలవీచ్యుదధిర్భవాన్॥

బ్రాహ్మణఉవాచ॥ భూపపృచ్ఛసికింశ్రేయఃపరమార్థన్నుపృచ్ఛసి
శ్రేయాంస్యపరమార్థాన్యశేషాణ్యేభూపతే ॥
దేవతారాధనంకృత్వాధనంసంపదమిచ్ఛతి ।
పుత్రానిచ్ఛతిరాజ్యంచశ్రేయస్తత్ప్రాప్తిలక్షణం॥
కర్మయజ్ఞాత్మకంశ్రేయస్స్వర్లోకఫలదాయియత్ ।
శ్రేయఃప్రధానంచఫలేతదేవానభిసంహితే ॥
ఆత్మాధ్యేయస్సదాభూపయోగయుక్తైస్తథాపరమ్।
శ్రేయస్తస్యైవసంయోగఃశ్రేయోయఃపరమాత్మనా॥
శ్రేయాంస్యేవమనేకానిశతశోథసహస్రశః ।
సంత్యత్రపరమార్థస్తుతత్పరశ్రూయతాంచమే॥

ధర్మాయత్యజతేకిన్నుపరమార్థోధనంయది।
వ్యయశ్చక్రియతేకస్మాత్కామప్రాప్త్యుపలక్షణః॥
పుత్రశ్చేత్పరమార్థస్స్యాత్సోప్యన్యస్యనరేశ్వర।
పరమార్థభూతస్సోన్యస్యపరమార్థోహితత్పితా॥
ఏవంనపరమార్థోస్తిజగత్యత్రనరాధిప।
పరమార్థోహికార్యాణికారణానామశేషతః॥
రాజ్యాదిప్రాప్తిరత్రోక్తాపరమార్థతయాయది।
పరమార్థాభవంత్యత్రనభవంతిచవైతతః॥
ఋగ్యజుస్సామనిష్పాద్యంయజ్ఞకర్మమతంతవ।
పరమార్థభూతంతత్రాపిశ్రూయతాంగదతోమమ॥
యత్తునిష్పాద్యతేకార్యంమృదాకారణభూతయా।
తత్కారణానుమనాత్ జ్ఞాయతేనృపమృణ్మయమ్॥
ఏవంవినాశిభిర్ద్రవ్యైస్సమిదాజ్యకుశాదిభిః।
నిష్పాద్యతేక్రియాయాతుసాభవిత్రీవినాశినీ॥
అనాశిపరమార్థశ్చప్రాజ్ఞైరభ్యుపగమ్యతే।
తత్తునాశినసందేహోనాశద్రవ్యోపపాదితమ్॥
తదేవాఫలదంకర్మపరమార్థోమతస్తవ।
ముక్తిసాధనభూతత్వాత్పరమార్థోనసాధనమ్॥
ధ్యానంచైవాత్మనోభూపపరమార్థార్థశబ్దితమ్।
భేదకారిపరేభ్యస్తుపరమార్థోనభేదవాన్॥
పరమాత్మాత్మనోర్యోగఃపరమార్థఇతీష్యతే।
మిథ్యైతదన్యద్ద్రవ్యంహినైతితద్ద్రవ్యతాంతతః॥
తస్మాచ్ఛ్రేయాంస్యశేషాణినృపైతానినసంశయః।
పరమార్థస్తుభూపాలసంక్షేపాచ్ఛ్రూయతాంమమ॥
ఏకోవ్యాపీసమశ్శుద్ధోనిర్గుణఃప్రకృతేఃపరః।
జన్మవృద్ధ్యాదిరహితఆత్మాసర్వగతోవ్యయః॥

పరజ్ఞానమయోసద్భిర్నామజాత్యాదిభిర్విభుః।
నయోగవాన్నయుక్తోభూన్నైవపార్థివయోక్ష్యతే॥
తస్మాత్మపరదేహేషుసతోప్యేకమయంహియత్।
విజ్ఞానంపరమార్థోసౌద్వైతినోతత్వదర్శినః॥
వేణురంధ్రవిభేదేనభేదష్షడ్జాదిసంజ్ఞితః।
అభేదవ్యాపినోవాయోస్తథాతస్యమహాత్మనః॥
ఏకస్వరూపభేదశ్చబాహ్యకర్మప్రవృత్తిజః।
దేవాదిభేదేపధ్వస్తే న్యావావరణోహిసః॥
ఇతి శ్రీవిష్ణుపురాణేద్వితీయాంశేచతుర్దశోధ్యాయః॥

తా॥ పరమార్థసమన్వితంబైన ఆబ్రాహ్మణుని వాక్యములువిని సౌవీరమహారాజు వినయముతో నిట్లనియె, మహాత్మా! ప్రకృతి పురుష విభాగంబునుపరమార్థంబునగు తమవాక్యములనువిని, దేవమనుష్యాది నామభేదంబులను, నీలపీతాది రూపభేదంబులను దొలగినిర్మలమైనను, నామనముపరమార్థంబిదియనియెఱుంగఁజాలక భ్రమనొందుచున్నయది. బ్రహ్మాది స్థావరాంతంబు లగు నిఖిల జంతుజాలముల యందును, జ్ఞానగమ్యంబైనఆత్మ తత్వంబు ప్రకృతికంటె పరంబనియు శిబిక నా మీఁదలేదు, నేను శిబిక వహించువాడనుగాననియు తనకంటె భిన్నంబైన దేహంబుచేశిబికధరింపబడుచున్నదనియు సత్వరజస్తమో గుణంబులనియెడు మహాప్రవాహంబువలన భూతంబులు, అనాది కర్మవశంబున సత్వాదిగుణంబులం ప్రవర్తిల్లుచున్నవనియు,మీరుచెప్పిన వచనంబులువిని, నామనంబు సంతుష్టింజెందె.ఇకసర్వాతిశయంబైనపర మార్థంబుతెలియంగోరు నామనస్సునసంతోషంబుప్పొంగుచున్నయది. నేను యథార్థమున యుత్తమోత్తమంబైన శ్రేయంబునపేక్షించి మహానుభావుడైన కపిలమహర్షి నడుగంగోరి పోవునెడ నాయందు కరుణగలిగి తత్వోపదేశంబుగావించితిరి.గానకృతార్థుండనైతి, సర్వ

జగన్మయుండునగు అనంతుని యంశభూతుండునై అవతరించి జనుల అజ్ఞానాంధకారంబులం దొలగింపుచు విహరించుచున్నయట్టి కపిలాచార్యులే నాయందలి కృపావిశేషంబువలన ప్రత్యక్షులై తత్త్వహితపురుషార్థంబుల నుపదేశించుచున్నవారని తలచెద. నిర్మల జ్ఞానామృత పయోనిధులైన మీకు వందనంబొనర్చి మీశిష్యుండనైయున్న నాకు ముఖ్యంబైన శ్రేయంబుపదేశింపుడు అనిరాజు ప్రార్థించెను. అపుడు భరతుండు, ఓ రాజా! పరమార్థంబైన శ్రేయంబు తెలియంగోరెదవేని, జగంబునంగల శ్రేయంబులెవ్వియును పరమార్థంబులుగావు. దేవతల నారాధించుటవలన గలిగిన ధనసంపదయు, పుత్ర సౌభాగ్యంబును సామ్రాజ్య ప్రాప్తియు, సురలోకసుఖప్రదంబులైనయాగాదికర్మంబులునుఫలాపేక్షవిరహితంబులగునివృత్తికర్మంబులును, యోగాభ్యాసంబువలన ఆత్మధ్యానంబుఁ జేయుటయు, జీవాత్మ పరమాత్మయోగంబు మొదలగు ననేక శ్రేయంబులును శతసహస్రంబులుగలవు. వానియం దెవ్వియును పరమార్థంబులుగావు.పరమార్థంబైన శ్రేయంబు వేరొకటి కలదు, తెలిపెదవినుము. ధనంబుపరమార్థంబంటివేని, ధర్మకామంబుల కొఱకు సంపాదితంబై వ్యయంబు సేయంబడుఁగాన, అట్టి ధనంబునకు పరమార్థత్వంబెక్కడిది. పుత్రుండు పరమార్థంబని తలచితివేనిఁదనకు తనపుత్రునివలె తానునిజజనకునికి పరమార్థంబు, అతండు తనతండ్రికి పరమార్థంబు,అతండు వేరొక్కరునకు పరమార్థభూతంబైన శ్రేయంబునుంగావలయు,పెక్కుమాటలేమిటికి, కారణంబులకెల్ల కార్యంబులు పరమార్థంబులుగావలయు,పరమార్థంబసాధారణంబుగాని సర్వసాధారణంబుగాదు. కావున జగంబున పరమార్థంబైన అర్థంబేమియులేదు. రాజ్యాదిప్రాప్తిపరమార్థంబంటివేనిఅదియుకొన్నిదినంబులుండుకొన్ని దినంబులులేకయుండు, గాన దానికిం పరమార్థత్వంబు పలుకంగూడదు.

ఋగ్యజుస్సామాథర్వణంబులచే విహితంబులగు యాగాది కర్మంబులు పరమార్థంబంటివేని కారణంబైన మృత్పిండంబువలనంగలిగిన

ఘటంబును మృణ్మయంబైన తెఱంగునవినాశవంతంబులగును. ఆజ్య సమిత్కుశాదిహోమద్రవ్యంబులచేజేయఁబడిన యాగంబును,తజ్జన్య ఫలంబును, వినాశవంతంబులగుఁగావున, యాగాది కర్మంబులును పర మార్థంబులుగావు, ఎద్దానికి నాశంబులేదో యదియ, పరమార్థంబని ప్రాజ్ఞులు పలుకుదురు. గాన నాశవంతంబులైన ద్రవ్యంబులచేఁ జేయం బడిన వస్తువులు నాశవంతంబులనుటకు సందియంబులేదు. ఫలాపేక్షా విరహితంబైన నివృత్తికర్మంబు పరమార్థంబంటివా, ముక్తిసాధనజ్ఞానం బునకు హితంబైన నివృత్తికర్మంబునకుపరమార్థత్వంబువచింపంజనదు. ఆత్మధ్యానంబుపరమార్థశబ్దవాచ్యంబంటివాఅదిఅహమ్మనియెడిజ్ఞానంబు దానివలన పురుషుండు సంసారదశయందు భిన్నమనస్కుండై విషయలోలుండగుచు నున్నవాడుకాన మనోభేదకంబును స్మరణాత్మ కంబును క్షణికంబునగు ఆత్మధ్యానంబును పరమార్థంబు కానేరదు. ఓరాజా! పరమార్థంబైన అర్థంబు యెన్నడును భేదకంబుకాదు. పర మాత్మ జీవాత్మలయోగంబు పరమార్థంబంటివేని ఎన్నడు నొక ద్రవ్యంబు వేరొకద్రవ్యంబుగానేరదుగాననదియుమిథ్యయనితలంపుము. ఓరాజా ! పరమార్థంబు సంక్షేపంబుగా నెరింగించెద వినుము. ఆత్మ ఏకస్వరూపుండును, సర్వవ్యాపకుండును,వైషమ్యరహితుండును, శుద్ధుండును,స్థూలత్వవిషమత్వాశుభత్వాదిహేయగుణవిరహితుండును ప్రకృతికంటె పరుండును, జన్మాది రహితుండును, నిరుపాధిక జ్ఞాన వ్యాపకత్వంబు వలన సర్వగతుండును, పూర్ణుండునై దుఃఖకరంబును సంకుచితంబునగుజ్ఞానంబుకంటె,పరంబైనజ్ఞానవిశేషంబువలనంబొలు పొందుచుఅసత్యంబులగునామజాత్యాదులులేకకాలవశ్యతయునొందక స్వయంప్రకాశుండైయుండుగాన స్వదేహంబులందును, పరదేహంబు లందును, జ్ఞానైకాకారుండైయున్న యాత్మస్వరూపంబొక్కటియే పరమార్థంబు.ఓరాజా !సకలచేతనులపూర్వోక్తలక్షణసమన్వితులఁగా

దలంపక(అన్యగాజ్ఞానస్వరూపముగాదలపక)ఉత్తమాధమ భావంబుల భిన్నులంగాదలంచునట్టివారలు మిథ్యాజ్ఞానులనితలంపుము. అనేకపురుషులచే పూరింపంబడునట్టి వేణువులయందు యేకాకారంబైనవాయువు షట్జ మధ్యమ పంచమాది స్వరభేదంబులవినంబడుచందంబున, దేవతిర్యఙ్మనుష్యాదినానావిధదేహంబులందును యేకాకారంబుగా నున్నయట్టి ఆత్మ బాహ్యధర్మంబులచే దేవమనుష్యాదిభేదంబులవ్యవహరింపబడుచు నున్నవాడు. దేవాది భేదభిన్నంబైన ఆవరణంబు తొలగెనేని ఆత్మనిజస్వరూపావిర్భావమునొంది స్వప్రకాశ చిద్రూపుండై వెలుంగు. ఇట్టి స్వప్రకాశచిద్రూపుడైసర్వకాలసర్వావస్థలయందువెలుగుస్వానుభవమే కృతకృత్యత్వమనిజనకమహారాజు, శుకబ్రహ్మమునకుబోధించియున్నారు.

## ఆ శుక జనక సంవాదం బెట్టిది ?

శ్రీవేదవ్యాసులు, బ్రహ్మ, నారదులు, దక్షిణామూర్తీశ్వరుడు అతి సూక్ష్మమైన ఉపనిషద్రహస్యార్థములను శుకబ్రహ్మఋషికి బోధించియు, సంశయనివర్తిగానందున-వ్యాసులవారు శుకులవారినింజూచి జనకులవారివద్దకింబోయిున్న నీ సంశయములు నివర్తించునని జెప్పగా శుకులవారు వ్యాసులవారి యనుమతిచొప్పున జనకులవారివద్దకివెళ్ళి, వారి నగరుముందరనిలువంబడి తనరాకజనకులవారికిం దెలియబరచిన, జనకులవారు శుకులవారు వచ్చిన సమాచారంబువిని ఆశ్చర్యంబునొంది, వ్యాస,బ్రహ్మ, నారద, దక్షిణామూర్తుల వల్లబోధింపంబడి స్వరూపముగానేయుంటున్నారు. అట్లుండియుతాను స్వరూపంబగునో కాదోయను సంశయంబువలన వచ్చియున్నారుగాన, నేనుబోధింపందగినది యొకటియును లేదుగదాయని యోచించి, వీరి నడవడులను జూడవలయునని యేడురోజులు తన నగరు మొదటి ద్వారమున

నిలిపియుండిరి. అచ్చట శుకులవారన్నపానాదులు లేక యుపవాస ముగనే యుండిరి. పిమ్మట తన గృహామధ్యమునందు నిస్సంశయముతో సప్తరోజులు నివసింపజేసిరి-అనంతరము రాజు తన యంతఃపురమునకు పిలుపించుకొని శుకులవారికి వందనములు సేసి, తైలాభ్యంజనాదులను జరిపి, అర్ఘ్యపాద్యాదులనొసంగి, షడ్రసోపేతమైనయన్నంబు బెట్టించి, సుందర స్త్రీల వలన నుపచారంబులు సప్త దినములు జరిపించిరి. శుకులవారు ముందు పదునాలుగు రోజు లుపవసించి నప్పటికిన్ని దుఃఖక్లేశములు లేక, సప్తదివసములుపచరించుటచేత సుఖక్లేశమున్ను లేక యుండుటను జనకులవారు జూచి మహా దానందభరితులై, స్వామీ ? మీరు పరిపూర్ణమైన బ్రహ్మస్వరూపముగనే యున్నారు. బొందవలసిన వస్తువును బొందేయున్నారు. మీయొక్క మనస్సు ప్రపంచస్వరూపముగా వర్తించలేదు.అట్లుండియు నేనుఁబూర్ణత్వమును బొందితినో లేదోయను సంశయమువలన యిచటికి విచ్చేసితిరి. సంశయమువదలుడు. వ్యాస, నారద, బ్రహ్మదేవ, దక్షిణామూర్తులు పరమార్థతత్వమే బోధించియున్నారు. నేనున్ను చెప్పఁబోవునది యాయభిప్రాయమేను. అయినను తమయొక్క స్వరూపానుభవమును వచించుండనిజనకులవారడుగ-శుకులవారు తమస్వరూపానుభవమును జెప్పుచున్నారు. సుఖస్వరూపముగానుండే నా యొక్క సంకల్పమే ప్రపంచమైవర్తించుచున్నది. అటులవర్తించు ప్రపంచమును వేరని జూచుటే బంధము, ఆసంకల్పత్యాగమే మోక్షస్వరూపము-ఆరోపము అధిష్ఠానమునకంటె వేఱుగాని విధముగా నామరూపాత్మక ప్రపంచ మంతయు నిత్యముక్తబ్రహ్మస్వరూపమేను - ఆశుద్ధ సుఖస్వరూపమే మనమునిత్యముక్తాదిస్వరూపాతీతులముమనమే-పరాపరవస్తువుమనమే-పరాపరాతీతులముమనమే. చేతనాచేతనమై,దృశ్యాదృశ్యమై,పరబ్రహ్మమై ఏకరూపమై, అనేకరూపమై, సత్తాసత్తై, సత్యాసత్య విలక్షణరూపమై,

సత్తు చిత్తు,ఆనందస్వరూపమై,సచ్చిదానందస్వరూపాతీతమై,ద్వైతమై, అద్వైతమై,ద్వైతాద్వైతాతీతమై, అఖండైకరసమై,అఖండైకరసాతీత మై,అక్షయానన్దమై, అక్షయానన్దాతీతమై ,చిదాకాశమై,చిదాకాశాతీత మై,తానేతానై,తానే తాననేశబ్దాతీతమై,ఉపనిషదర్థమై,ఉపనిషదర్థాతీ తమై,అదిఇదియనినదై,ఈవికల్పములులేనిదియైయెసత్తురహిత, చిత్తురహిత ఆనన్దరహితమైయేస్వరూపమున్నదోఅదియేతనస్వరూపమనిశుకబ్రహ్మ ఋషిచెప్పగా జనకులవారుమహదానన్దభరితులై శుకులవారిని మఱల ప్రశ్న జేయుచున్నారు.

జ-ప్ర-సత్తనగా నెట్టిది ?

శు-ఉ-తాను బ్రహ్మమని విచారించి నిశ్చయించిన పిమ్మట బ్రహ్మమనే శబ్దమునున్ను, ఆయర్థమునున్ను వదలియుండుటయేసత్తు.

జ-ప్ర-చిత్తనగా నెట్టిది ?

శు-ఉ-తాను జ్ఞానస్వరూపమని నిశ్చయించినపిమ్మటఆనిశ్చయమున్ను, ఆ స్వరూపమున్ను, వాసనతోటి వదలియుండుటయే చిత్తు.

జ-ప్ర-ఆనన్దమనగా నెట్టిది ?

శు-ఉ-ఆత్మానన్దమును ఇది ఆత్మానన్దమని యెరిగి అనుభవించిన పిమ్మట ఆయెరుకను వదలుటయే ఆనన్దము.

జ-ప్ర-బంధమనగా నెట్టిది ?

శు-ఉ-సత్స్వరూపమందు చింతలేనప్పుడుతనస్వరూపమునుతనకుతానే మరచినదియని మఱల ఆరంభమునుంచి విచారించవలయునని సద్గురువులవద్దికిఁబోవుటయే బంధము.

జ-ప్ర-మోక్షమనగా నెట్టిది ?

శు-ఉ-బ్రహ్మము నేనని నిశ్చయించి ఆనిశ్చయమును వదలిపెట్టి యుండుటయే మోక్షము.

జ-ప్ర-అజ్ఞానమనగా నెట్టిది ?

శు-ఉ-స్వరూపమును మరచి స్వరూప స్వభావ మగుపడలేదని యెంచుటయే అజ్ఞానము.

జ-ప్ర-ఆవరణమనగా నెట్టిది ?

శు-ఉ-స్వరూపమును మరుగుబరచిదేహమే నేనని వచ్చెడిచిత్తవృత్తియే ఆవరణము.

జ-ప్ర-విక్షేపమనగా నెట్టిది ?

శు-ఉ-తానుగానిది తానని యెంచుటయే విక్షేపము.

జ-ప్ర-పరోక్షమనగా నెట్టిది ?

శు-ఉ-తన స్వరూపమునుమరచిశృతులవల్లనున్ను,గురువులవల్లనున్ను, బుద్ధివల్లనున్ను విచారించుటయే పరోక్షము.

జ-ప్ర-అపరోక్షమనగా నెట్టిది ?

శు-ఉ-శృతులవల్లనున్ను,గురువులవల్లనున్ను,స్వానుభవమువల్లనున్ను, దెలిసికొనినరీతినిస్వరూపమాత్రముగ్గనిలుచుటయేఅపరోక్షము.

జ-ప్ర- అనర్థనివృత్తియనగా నెట్టిది ?

శు-ఉ-గురుముఖశ్రవణమువలన తనస్వరూపము, సత్తామాత్రమని ఎరిగినదియే అనర్థనివృత్తి.

జ-ప్ర-ఆనన్దసుఖమనగా నెట్టిది ?

శు-ఉ-సకలమున్ను నివర్తియై ఆనన్ద సుఖమాత్రమున నుండునదియే ఆనన్ద సుఖము.

జ-ప్ర-ఈసుఖానన్దమున కధికారి యెవరు ?

శు-ఉ-ఆకాశపు నల్లుపువలె తన్నుజీవుడని యెంచుకొని మోక్షమును గోరువాడే అధికారి.

జ-ప్ర-హృదయగ్రంధియనగా నెట్టిది?

శు-ఉ-తానే తానై ప్రకాశించుచుండగా చంకనున్న బిడ్డను గానమని వెదకునదియే హృదయగ్రంధి.

జ-ప్ర-చంచలమనగా నెట్టిది ?

శి-ఉ-గురువులవలన, శాస్త్రములవలన, తనయనుభవమువలన తన స్వరూపమును,విచారించకయుండుటయేచంచలము.

జ-ప్ర-దుఃఖమనగా నెట్టిది ?

శి-ఉ-శశవిషాణమువలెనున్ను, వంధ్యాపుత్రుని వలెనున్ను, ఇంద్ర జాలమువలెనున్ను వచ్చునట్టి ద్వైతవృత్తియే దుఃఖము.

జ-ప్ర-సుఖమనగా నెట్టిది ?

శి-ఉ-పరిపూర్ణుఁడని,పరమాత్మయని,స్వయంప్రకాశమని,చిన్మయమని, స్వర్ణసంకులములవలెవచ్చునట్టి అద్వైతవృత్తియేసుఖము.

జ-ప్ర-ఇట్టిస్వరూపనిష్ఠనకు విశేషమెట్టిది ?

శి-ఉ- గురుముఖ విచారణవలన నిశ్చయస్వరూపముగానుండునది నేనని నిశ్చయించియుండుటయే స్వరూపనిష్ఠ.

జ-ప్ర-అవిషయమనగా నెట్టిది?

శి-ఉ-సర్వత్రయున్నదనే కాలంబునువదలి,యెరుకవదలిసుఖమున్నదో లేదోయనేసంకల్పమును వదలి వస్తువుతానేయని వచ్చునట్టి చిత్తవృత్తి అవిషయము.

-ప్ర-మౌనమనగా నెట్టిది ?

శి-ఉ-గురువని,శిష్యుఁడని, సత్తని, చిత్తని, చక్కగావిచారించి, నిశ్చయించినపిదప ద్వైతవృత్తిజనించకయుండుటయే మౌనము.

ప్ర-ఇట్టి అధికారికి ఆచార్యులెట్టివారు ?

-ఉ-జ్ఞానాకాశరూపమై తనయందేనిలకడగలదై నిత్యమంగళ స్వ
రూపమై, యేదోషములేనిదై, ఒకదానియందుకల్పింపబడనిదైనామ
రూపరహితంబై, యేమియునులేనిదైఅన్నిటికినితానేకారణమైన
మొకకారణములేనిదై ప్రకాశించుస్వరూపమై-సంకల్పవికల్ప
తరంగములు లేని సముద్రమువలె విధినిషేధ

భేదాభేదమువదలి ప్రారబ్ధఫలమునకు సంతోషించువారే ఆచార్యులనుట.

జ-ప్ర-శిష్యుఁడనగా నెట్టివాఁడు?

శు-ఉ-తాను ఆత్మయని విచారించి, నిశ్చయించి మఱల ద్వైతవృత్తిని ప్రవేశింపక నేతినేతిగా వదలిపెట్టి యుదకమందుఁ జేర్పబడిన సైంధవమువలె ఆచార్యశబ్దమందులయించిన అవస్థను బొందినవాఁడే శిష్యుఁడని చెప్పబడును.

జ-ప్ర-గురూపదేశమువలన ముఖ్యముగా నెరుగదగ్గదియేది?

శు-ఉ-సకల స్వరూపములు నానావిధములై యుండే నామరూపంబుల విమర్శతను స్పష్టముగ నెరుగునది యేదియో అదియే నెరుగతగ్గది.

జ-ప్ర-చూచినదియేది?

శు-ఉ-ఏ స్వరూపమైతే, ఆగమములచేతను, వేదశాస్త్రములచేతను అగుపడక ఆచార్యునివాక్కువలన తాను తానేయని అయినదియును గాదని, గాదనునది గాదని యేదికలదో అదియే జూచినది.

జ-ప్ర-అగుబడనిది యేది?

శు-ఉ-కాలత్రయమందును నేను, నీవు, అది, ఇది, అనే వృత్తులవల్లను దోఁచక, మనస్సునకు, దృష్టికి దోఁచక ప్రత్యక్షముగా తనకు అగుపడు చుండునదియే అగుబడనిది.

జ-ప్ర-ఎరిగినదియేది?

శు-ఉ-సమస్త ప్రపంచమువల్లనున్ను, సమస్త అర్థములవల్లనున్ను, సమస్త అనుభవములవల్లనున్ను, యెఱుగక యుండునది యేదిగలదో అదియే ఎరిగినది.

జ-ప్ర-ఎఱుగబడనిది యెట్టిది?

శు-ఉ-ఇది ఆత్మ, ఇది అఖండాకాశము, ఇదియే అక్షయము, నేను బ్రహ్మమనే సమ్మతము, ఇవిదోఁచకయుండునట్టిదేదియో అదియే ఎఱుగబడనిది.

ఊ-ప్ర-విడిచినది యెట్టిది ?

శు-ఉ-అనుస్యూతమున్ను విచారణవలన శేషించిన ఆత్మ త
నిశ్చయించి, పిమ్మట గురువుల వద్ద తనకు ఆత్మత్వము
మిథ్యయని యెఱుగునదిన్ని వదలియుండుటయే విడిచినది.

ఊ-ప్ర-విడువనిది యెట్టిది ?

శు-ఉ-చక్కగా విచారించక, అజ్ఞానమువదలక, తాను బ్రహ్మమ
చెప్పబడ్డ అర్థము విడువనిది.

ఊ-ప్ర-పోయినదెట్టిది ?

శు-ఉ- సకల సంకల్పవృత్తిన్ని, తాను బ్రహ్మమనునదిన్ని, దృఢముగా
విచారించి, నిశ్చయించిన పిమ్మట, నిద్రించు వానిచేతి వస్తువు
జారిపోయినట్లు బోయినదే బోయినది.

క ॥ భావాభావము వెడలిస్వ।భావంబున వెలుగుచుండు పరమార్థమటం
చేవగపు నేవికారము । నేవెంటఁ బొరయ కాతఁడిలను శోభించుఁ॥

గీ॥ బహువిధాశ్చర్యమయమీ ప్రపంచమెల్ల । చూడపసలేదనుచు శంక
వీడుకొన్న।యతఁడు వాసనలందక నతుల శుద్ధ । బోధమాత్రుండునై
శాంతిబొందకున్నె॥

గీ॥ ఏవికల్పంబులును లోన నింతలేక । వెలపల యథేచ్ఛగాగను
మెలగుచున్న।వానిభావంబునటువంటివారెగాక । యితరులెవ్వార
లైననునెరుగగలరె॥

గీ ॥ ఘనవిరక్తుండు విషయసంగతుఁడుగాఁడు।రాగకలితుఁడు విషయోప
భోగియౌను । బంధమోక్షవిహీనుఁడెప్పటికిరాగ । వశుఁడును
విరక్తుఁడును గాఁడు పరమునీంద్ర॥

క ॥ హరిహరపద్మజులైన। న్నిరవుగనుపదేశమిచ్చి రేనియునీకుఁ।
బరికింపలేదు భావం।బురుమతి సకలంబు మరచియుండుట కన్నఁ॥

గీ॥ తృప్తుఁడు వశేంద్రియుండును నిస్పృహుండు। సర్వసముఁడును నే
యగుచునలరు । నట్టిసుజ్ఞాని యెవ్వరికందరాని । యోగః
ఫలమును బొందుచుండు॥

గీ॥ కడగి ధర్మార్థకామమోక్షములయందు । జీవితములందుమ
చింతలేక।గ్రాహ్యావర్జంబులందును కాంక్షలిడక।నుండుధీ

గానుర్వినోకడు॥

భేదమేల్కొననడునిద్ర పోవఁజేనియునోకింత|కన్ను దెరవఁడుముయ్యఁడు జడున్నకునికి। యేమిజెపుదునోకానోకయీయవస్థ । ముక్తిచేతను నకుజెల్లుమునివరేణ్య॥

॥ పురుషులందును మిగులపూబోణులందు । బ్రాప్తసుఖదుఃఖసంపదాపదలయందు। ననఘసర్వత్రసమదర్శియైనయట్టిధీరునకు నేవి శేషమెద్దియును లేదు॥

గీ॥ కాయమొనరించుచున్నదికర్మమెల్ల । శుద్ధరూపుఁడనేనోకించుకయు సేయ । ననెడువిజ్ఞానసంపన్నుడనుదినంబు । జేసియును సేయకుండు నశేషవిధులు॥ (అష్టావక్రగీత.)

"నయశ్చాయంపురుషే యశ్చాసావాదిత్యే సఏకః"

"త్వం బ్రహ్మాసి అహమేవాంతరంనవిద్యతే"

"మాయావిద్యేవిహాయైవఉపాధిపరజీవయోః।

అఖండంసచ్చిదానందంపరంబ్రహ్మవిలక్ష్యతే"

"క్షీరంక్షీరేయథాక్షిప్తంతైలంతైలేజలంజలే।

సంయుక్తమేకతాంయాతిత థాత్మాన్యాత్మవిన్మునిః"

ఇత్యాది శ్రుతిస్మృతి పురాణేతిహాసాది వాక్యార్థముల శ్రవణ మనననిదిధ్యాసములచే, అనగా, చిత్తాకాశమందు చిత్స్వరూపమైన పరమాత్మవిషయిక ధ్యానమనియెడి నిష్ఠచే సంశయసంకల్పరహితులై, దిగ్దేశ కాలవ్యవస్థలు లేని సచ్చిదానంద వస్తువునందుగలిసి సదానంద సాగరమున మునిగికృతార్థులగుదురని బ్రహ్మవేత్తలందురు.

చతుర్విధప్రశ్నోత్తరాత్మోపదేశ బోధదర్పణమ్.

సమాప్తము.

నారాయణ. నారాయణ.

ఓమ్.

తత్సత్